# యాజ్ఞవల్క్య చరిత్రము

## ఘట్టుప్రభువు



సంపాదకులు :

లింగంగుంట వెంకటసుబ్బయ్య

ప్రకాశకులు :

లింగంగుంట వెంకటసుబ్బయ్య

నెం. 1. ఆరుముగంశెట్టి వీధి, తిరువళ్లిక్కేణి, మదరాసు-5.

కాపీరైటు రిజిస్టర్డ్] 1955 [వెల రూ. 1-0-0



'విద్యారత్న' నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.,

మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షుడు.

శ్రీ యాజ్ఞవల్క్యగురవే నమః.

# గ్రంథ పరిచయము

---

వందేహం మంగళాత్మానం భాస్వంతం వేద విగ్రహం
యాజ్ఞవల్క్యం మునిశ్రేష్ఠం జిష్ణుం హరిహరప్రభుమ్ ।
జితేంద్రియం జితక్రోధం సదా ధ్యాన పరాయణం
ఆనందనిలయం వందే యోగానందం మునీశ్వరమ్ ॥

ఆంధ్రుల సాంఘికజీవితచరిత్ర తెలిసికొనుటకు నాంధ్రదేశమున వెలసిన చాతుర్వర్ణ్యములయొక్కయు వానిలోగల యవాంతరశాఖల యొక్కయు చరిత్రలను పరిశీలించుట యత్యంతావశ్యకము. దానికి తెనుగు సారస్వతముకూడ నొక ప్రధానసాధనముగా పరిగణింపవచ్చును. దీనికి కారణము కవులు బ్రాహ్మణశాఖవారైనప్పుడు తమతమ గోత్రములను సూత్రములను తమ కృతులలో చెప్పక తప్పదు. ఆదికాలమున నన్నయనుండి నేటివఱకును (కేవల నవ్యకవితాధోరణిలో వ్రాసిన కవులు తప్ప) నీ యాచారము విధిగా పాటింపబడుచునే యున్నది. ఇంతేకాక, దైవపరముగాగాని, మానవపరముగాని కృతులను నంకితముచేయుట మనలో నొక విశిష్టమైన సంప్రదాయము. అంకితము చేయునప్పుడు కృతికర్తయొక్క సూత్రగోత్రములు చెప్పుట తప్పనిసరి కాబట్టి మనసాహిత్యమును చక్కగా పరిశీలించిన, నాయాశాఖల చరిత్రమును, నందు కీర్తనీయులైన, మహాపురుషులయొక్కయు కవులయొక్కయు విశేషములను కొన్నియో తెలియగలవు.

తెనుగు దేశమున, శుక్లయజుర్వేదులనియు, ఆదిశాఖవారనియు, ప్రసిద్ధిచెందిన బ్రాహ్మణశాఖవారికి మూల పురుషుడు యాజ్ఞవల్క్యమహర్షి. ఆతని విద్యావంశీయులగుటచేత నీ శాఖవారు యాజ్ఞవల్క్యుని వ్యవహృతులైనారు. ఈ శుక్ల యజుర్వేదమును ప్రచారములోనికి దెచ్చిన మహర్షి యాజ్ఞవల్క్యుఁడు. ఆతడు దీనిని పదునైదు శాఖలుగా విభజించి కణ్వ,మధ్యందిన గాలవ పారాశరాదులకు నుపదేశించెను. అందు ప్రథమశాఖ ప్రథమమున కాణ్వమహర్షి కుపదేశించెను. ఆ శాఖ ప్రధానమగుటచే వారిని ప్రథమశాఖవారని, ఆదిశాఖవారని కాణ్వశాఖీయులని యందురు. తక్కిన మాధ్యందినులు మొదలగువారికి పేరు లా మహాఋషుల పేర్లవలన నేర్పడినవి.

భారతవర్షమున ప్రాచీనకాలమున విలసిల్లిన మహర్షులలో ప్రముఖుఁడై, స్మృతికర్తయై, శుక్లయజుర్వేదులకు మూలపురుషుడైన యాజ్ఞవల్క్య మహాముని పవిత్రజీవితమును 'యాజ్ఞవల్క్య చరిత్రము' అను పేర ప్రశస్త పద్యకృతిగా రచించినకవి - ఘట్టు ప్రభువు.

ఘట్టు ప్రభువు - కుచేలోపాఖ్యానము మూలమున నాంధ్రదేశీయు లందఱకును నీతఁడు సుపరిచితుడు. ఈతని గ్రంథములు నాలుగు మాత్రము మనకు లభించుచున్నవి. వానినుండి మనము గ్రహింపదగిన చరిత్ర యిది.

1. కుచేలోపాఖ్యానములో తన్ను గూర్చి యిట్లు చెప్పుకొన్నాడు.

సీ. శ్రమరాంబికా వరప్రభర దివ్యకవిత్వ
  విద్యాప్రవీణత వెలసినాఁడ
ఘటికాశతగ్రంథ ఘటనాసమంచిత
  చాతుర్యమహిమకుఁ జాలినాఁడ
ప్రాధిమనైకైక పక్షమాస మహాప్ర
  బంధ కల్పనశక్తిఁ బ్రబలినాఁడ
మఱియు వాకువు చిత్ర మాధుర్యవాక్యప్ర
  గల్భతంబున నుతుల్ గాంచినాడ

తే॥ శ్రీశుధరమల్లికార్జునశ్రీపదాబ్జ
మత్తభృంగాయమాన సన్మానసుండ
సత్కవీశ్వర కరుణాప్రసాద వసుఁడ
గట్టుప్రభు నామధేయ విఖ్యాత యశుఁడ". పీఠిక-12

ఆశ్వాసాంత గద్య :

ఇది శ్రీ భ్రమరాంబికావరప్రసాదలబ్ధకవితా ధురంధర, సకలకవి మిత్ర యల్లనామాత్యపుత్ర సకలసద్గుణవిధేయ ఘట్టుప్రభునామధేయ ప్రణీతంబైన కుచేలోపాఖ్యానంబను మహా ప్రబంధంబున ప్రథమాశ్వాసము.

2. యాజ్ఞవల్క్య చరిత్రము - గద్య.

ఇది శ్రీమద్భ్రమరాంబికావరప్రసాదలబ్ధ కవితాధురంధర పూర్వ కవిప్రయోగశబ్దానుబంధబంధుర సరసకవిమిత్ర - యల్లనామాత్య పుత్ర సకలసద్గుణవిధేయ ఘట్టుప్రభునామధేయప్రణీతంబైన యాజ్ఞవల్క్య చరిత్రంబను మహాకథయందు తృతీయాశ్వాసము.

ఇందవతారికాభాగమున కవినిగూర్చి లేదు.

3. సురాభాండేశ్వరము.

క॥ భ్రమరాంబాకర కవితో
ద్యమ విలసద్వర్ణసముద యాంకిత జిహ్వా
సుమహితుఁడ నాది కవితా
ప్రమదాజనకుండ ఘట్టుప్రభునామండన్ ॥

గద్య.

" ఇది శ్రీమద్భ్రమరాంబికావరప్రసాదలబ్ధకవితాధురంధర సరస కవిమిత్రయల్లయామాత్యపుత్ర ఘట్టుప్రభునామధేయ ప్రణీతంబైన సురా భాండేశ్వరోపాఖ్యానమునందు సర్వంబును నేకాశ్వాసము.

4. సత్యభామావిజయము-(R 871)

ఇది ద్విపదకృతి - మూఁడాశ్వాసములు యాజ్ఞవల్క్యాన్వయుఁడగు నాళ్ళగట్టు ఎల్లయామాత్యునికి కృతి - కృతిపతి కవినిగూర్చి చెప్పినపుడు

"కరమును రాణించు ఘట్టు వంశమున
సరసుఁడవయ్యు శేషకవీంద్ర నీవు"

అది చెప్పుటయేగాక గద్యమునం దిట్లు గలదు.

"ఇది భ్రమరాంబా సమిద్ధ ప్రసాద
విదిత సారస్వత విఖ్యాతఘట్టు
వీరసత్పుత్త్రనవీనసాహిత్య
సారాభిలాష శేషకవీంద్ర భవ్య
శేముషీరచితమై చెలువగు సత్య
భామావిజయ మని ప్రఖ్యాతిఁగాంచి
అనుపమంబైన మహాప్రబంధమున
అనఘవైఖరి తృతీయాశ్వాసమయ్యె"

పై యుదాహృతులవలన నీతడు భ్రమరాంబా వరప్రసాదకవి యనియు, శ్రీశైలమల్లికార్జునస్వామి భక్తుఁడనియు నానామధుర చిత్ర విస్తరకవితలయందు నేర్పుగలవాడనియు తెలియుచున్నది. ఈతడు తన సూత్రగోత్రములు చెప్పకపోయినను ఘట్టువారు కాన నితడు యాజ్ఞవల్క్యుఁడనుటలో సందేహములేదు. ఈతనితండ్రి వీరన యని యొక చోటను, ఎల్లన యని తక్కినచోట్లగలదు. వీరన వ్యవహారనామము ఎల్లియ్య అయియుండదగును. ఈతనిపేరు శేషయకవి.

ఘట్టుప్రభువు లనునది వ్యవహారనామము.

1. ఈతనికాలము:— [1]ఘట్టుప్రభువుకాలమునుగూర్చి వీరేశలింగము పంతులుగా రిట్లు వ్రాసియున్నారు.

---

1. ఆంధ్రకవుల చరిత్రము. 3-వ భాగము 98. పుట 265-267

"ఈ కవి నెల్లూరిమండలములోనివా డయినట్లును, అప్పటి కెనుబది సంవత్సరముల క్రిందట నుండినట్లును నెల్లూరు మండలచరిత్రమున వ్రాయబడినది. కాబట్టి కవి యిప్పటికి నూఱుసంవత్సరముల క్రిందట నుండినవాడు.

నెల్లూరిమండల చరిత్ర మిప్పటికి యెనుబదియేండ్ల క్రిందటిది. అనగా క్రీ. శ. 1870 ప్రాంతమిది. కావున నప్పటి కెనుబదియేండ్లనగా క్రీ. శ. 1750 ప్రాంతమున నీ కవి యుండవచ్చును. ప్రస్తుతము మనకు లభ్యములైన గ్రంథముల తాళపత్రప్రతులును నీ కాలమునే స్థిరపఱచు చున్నవి. ఆ వివరణము దీనితో నిచ్చుచున్నాను.

కుచేలోపాఖ్యానము - వ్రాతప్రతులు - 461 to 468

1. వికృతినామ సంవత్సర ఫాల్గుణ బహుళ ౧౦ బుధవారము లేఖరి మామిడి వెంకటలింగం. (R 151) క్రీ. శ. (1771)

2. 464. బ్రౌనుదొరవారి సూచి.

"This book contains the Kuchelopakhyanamu a very popular Telugu poem, and the various readings found in nine manuscripts are herein recorded with a view to the preparation of the new edition since completed."

C. P. BROWN.

3. సర్వజిత్తునామ సంవత్సర పుష్య శు ౧౨ శనివారము R 811

నెలకంటి రామయ్య - లోకమెచ్చు వెంకటరాజు ప్రతినిబట్టి వ్రాసినది. (1768 క్రీ. శ.)

సురాభాండేశ్వరము. (R 158.)

కాళయుక్తి సంవత్సర మార్గశిర శుద్ధ ౭ లు జయవారంరోజున వింజమూరి పుల్లయ్య వ్రాసెను. (1788-క్రీ. శ.)

యాజ్ఞవల్క్య చరిత్రము (R 491.)

శుక్ల సంవత్సర చైత్ర శుక్ల ౫ గురువారే దక్షిణదేశే అరణిగ్రామే యాజ్ఞవల్క్యేన రామనాథేన అమమకొండ సంప్రదాయ విశిష్టేన దత్త మిదం పుస్తకం కూచిమంచ్యాగ్ని మన్నారుకాత్రిణః

ఇది యాజ్ఞవల్క్య చరిత్రము ప్రతినిచ్చిన వారి పేరు కాలమును మాత్రమే తెలుపును.

పై నుదహరించిన తాళపత్రప్రతుల కాలములబట్టి ఘట్టుప్రభువు క్రీ. శ. 1730-1780 ప్రాంతముల నున్నవాడని నిశ్చయముగ చెప్ప వచ్చును.

ఘట్టుప్రభువు 'రంభారావణసంవాదము' అను యక్షగానమును రచించెనని, వీరేశలింగము పంతులుగారును, వారి ననుసరించి ప్రాచ్య లిఖితపుస్తక భాండాగార సూచికయందును వ్రాయబడినది. కాని, యక్ష గానకర్త శేషయకవి వేఱు. అతడు యాజ్ఞవల్క్యుడు కాడు. తలి దండ్రులు సూత్రగోత్రములు వేఱు కాబట్టి ఘట్టుప్రభువు కాడనుట యుక్తము.

ప్రస్తుతము ముద్రితమైన యాజ్ఞవల్క్య చరిత్రము, ఘట్టుప్రభువు కవితావైశద్యము చక్కగా ప్రదర్శింపఁ జాలియున్నది. సంస్కృతాంధ్ర భాషలయందుగల సామెతలను, పలుకుబళ్లను ప్రతి పద్యమునందు పొందుపఱచి, కోవిదగ్రామణులును, కోమలమతులగు మాణవకులును సాలంకషముగా పఠింపఁదగిన కుచేలోపాఖ్యానమును రచించిన ఘట్టు ప్రభువు కమ్మని కవితనుగూర్చి యెంతయేని వ్రాయనగును. గ్రంథవిస్తర భీతిని విరమించితిని.

ఈ చిన్న కావ్యమునగల, సూర్యస్తుతి, సూర్యదండకము, గాయత్రీ స్తుతి మొదలగునవి యాజ్ఞవల్క్యులకేగాక యఖిలశాఖలవారికెల్లను పారా యణ యోగ్యములై యున్నది. ఆంధ్రభాషాకావ్యమైనను, నిం దధ్యాత్మిక

వాతావరణము గుబాళించుచు యాజ్ఞవల్క్యమహర్షి యఖండ బ్రహ్మతేజస్సు సాక్షాత్కారము చేయుచు, నావంశీయుల కేకాక, ఆంధ్ర మహాజనుల కందఱకు నాదరణపాత్రమై అవశ్యపఠనీయమై యున్నది.

ఈ యాజ్ఞవల్క్య చరిత్రమును ప్రకాశమానము నొనర్చి, ఆంధ్రుల కంద జేసిన శ్రీయుత లింగంగుంట వెంకటసుబ్బయ్యగారిని నెంత ప్రశంసించినను స్వల్పమే యగును. వారు కేవలము ఆదిశాఖీయులైన స్వశాఖీయుల గ్రంథములను ప్రకటించు నుద్దేశముతో భాషాభిమానమే ప్రధానముగా గలిగి ఆహారవిహారాదిశారీరక సౌఖ్యముల నేని పాటింపక నీ గ్రంథముద్రణ మొనర్చుటయే వారు త్రికరణశుద్ధిగా చేయుచున్న సారస్వత సేవకు తార్కాణ. వారింకను చతుర్వాటికామహాత్మ్యము మున్నగు బహు మహా గ్రంథములను (ఇదివఱలో నొకసారియేని ముద్రితము కాకుండ నుండునవి) ముద్రింపనున్నారు. ఉదారాశయులగు యాజ్ఞవల్కీయులతో పాటు, ఆంధ్రమహాజనులందఱును శ్రీ వెంకటసుబ్బయ్యగారికి చేయూత నొసంగి వారు తలపెట్టిన కార్యములను కొనసాగింపఁజేయుదురని యాశించుచున్నాఁడను.

ఇట్లు విధేయుడు

విద్యారత్న నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.,

మదరాసు విశ్వవిద్యాలయాంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు.

1-1-1955.

ఇందుతో, ఈ శాఖలో పూర్వము వెలసిన కొంతమంది, మహనీయులయొక్కయు, కవులయొక్కయు సూచిక నిచ్చుచున్నాను. విపులముగా నవకాశము ననుసరించి, చతుర్వాటికా మాహాత్మ్యమున తెలుపుదును.

గజాంకుశుఁడు క్రీ. శ. 945.

ఈతడు ప్రాచీనాంధ్ర కవులలో నొకడు. నన్నయకన్న ముందు వాఁడు. [1]రాష్ట్రకూటచక్రవర్తియు క్రీ. శ. 986-965 వఱకు రాజ్యమేలినవాడునునగు మూడవ కృష్ణచక్రవర్తిచే గజాంకుశ బిరుదము బడసినవాడు. అతని యమాత్యుఁడు. కాలోద్దిగ్రామ శాసనమున నీతని విషయమిట్లున్నది.

శ్రీమతి మహిషవిషయే కాంచన ముడువోలితి ప్రసిద్ధగ్రామే వాస్తవ్యః కౌండిన్యో వాజసేయస్తు కణ్వ శాఖాధ్యయనః నారాయణాగ్నిదానేన రూ గజాంకుశ సంజ్ఞయా" కాణ్వశాఖీయులలో మంత్రిత్వము వహించిన ప్రాచీనులలో గజాంకుశుఁడు ప్రసిద్ధుఁడు.

తెనాలివారు. కౌండిన్యగోత్రులు.




1. ఈ కవినిగూర్చి యితర వివరములకు నేను రచించిన తెలుఁగు కవులచరిత్ర పుట 87-90 చూడుఁడు. అది మద్రాసు విశ్వవిద్యాలయము వారిచే ప్రకటితము.

తెనాలి

1. రామలింగకవి లేక రామకృష్ణకవి
   1. ఉద్భటారాధ్య చరిత్ర
   2. పాండురంగ మహాత్మ్యము
   3. ఘటికాచల మహాత్మ్యము
   4. కందర్పకేతు విలాసము } అలభ్యము
   5. హరిలీలా విలాసము } అలభ్యము

2. అన్నయ — సుదక్షిణా పరిణయము

3. శ్రీగిరి — శ్రీశైల మహాత్మ్యము (అలభ్యము)

4. రామభద్ర కవి — ఇందుమతీ పరిణయము

రామభద్రకవి తండ్రి యన్నలకృతులు లభింపలేదు.

<u>లింగమగుంటవారు</u> - కాశ్యపగోత్రులు

చెన్నయామాత్యుఁడు
|
శ్రీరామమంత్రి
|
అన్నప్ప - కమలమ్మ
- సర్వయామాత్యుఁడు — భాగీరథి
  - బసవన
  - రామన
  - లక్ష్మన - తిరుమలమ్మ (ఈమె కాళయ మంత్రి కోనమల కుమార్తె.)
    - పేరమారి
    - మాచయ
    - రామకవి (తెనాలి రామకృష్ణకవి యల్లుఁడు)
    - తిమ్మకవి సులక్షణసారకర్త
- తిమ్మన
- కసవన
- గాదన

1. లింగమగుంట రామకవి. ఈతడు పెదతండ్రి యైన రామమంత్రికి దత్తు. ఈతడు మహాప్రసిద్ధుఁడు మహాకవి తెనాలి రామకృష్ణకవి యల్లుడు. ఈతని రచనలు.

1. మత్స్యపురాణము.
2. వామన పురాణము.
3. వేంకటమహాత్మ్యము. } లభ్యములు కాలేదు.
4. ఆనందకానన మహాత్మ్యము.
5. చతుర్వాటికా మహాత్మ్యము. } లభ్యములు.

2. తిమ్మకవి-ప్రసిద్ధలాక్షణిక కవి-సులక్షణసారకృతి కర్త.

లింగమగుంట మాతృభూతకవి-అభినయ దర్పణము.

ఘట్టు వేంకటరామకృష్ణకవి. పట్టాభి రామాయణమను రామాయణ కథను రచించిన కవి. వేంకటరామకృష్ణకవి కాత్యాయన సూత్రుఁడు. కాశ్యపగోత్రుఁడు. వేంకటార్యపుత్రుఁడు ఈతడు ఆదిశాఖ నిట్లు వర్ణించి యున్నాడు. (R 172)

సీ॥ త్రిగుణుండు భాస్కరదేవోపదేశమై
అతిశయంబై యొప్పునాదిశాఖ
కాత్యాయనమహర్షి కారణంబై సక
లాగమాంచితమైన యాదిశాఖ
సూర్యాభిముఖుఁడయి శోధించి యుక్తతి
యనుభవవేద్యమౌ నాదిశాఖ
దివ్యమై మునిగణసేవ్యమై భవ్యమై
యమరవర్ణితమైన యాదిశాఖ

* ఈ గ్రంథము తంజావూరి సరస్వతీమహాలు భాండాగారము వ్రాత ప్రతినుండి, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు ప్రచురించియున్నారు.

గీ॥ వరయశస్సాంద్రుఁడగు ఘట్టువంశతేజుఁ
డైన వెంకటకృష్ణయ యనఁగనొప్పు
మంత్రిసుతుఁడగు రాఘవామాత్యమణికి
నమరి శ్రీవేంకటార్యాఖ్యుఁ డతులగుణుఁడు.

సీ॥ భ్రమరాంబికాలబ్ధ భాసిత మృదునవ్య
కవితారసజ్ఞతఁ గాంచినాఁడ
సంస్కృతాంధ్ర విచారసార కల్పిత పద్య
గద్య చమత్కృతి గల్గినాడ
తాళాదిరాగ సందర్భ నాటకవేద
జాతీయవిధములు సల్పినాడ
మాఘప్రబంధ నిర్మాణధౌరేయత
విద్వత్సభాస్థలి వెలసినాడ
గీ॥ లాలిత్యాకార మోక్షలక్ష్మీలలామ
యార్జితానంద రాగ యోగాంకముద్ర
కలితుఁడౌ ఘట్టిరామ సత్కవివరుండు
ఘనతకెక్కెను పదపద్య కల్పనమున.

తోలేటి వీరరాఘవకవి-వీరరాఘవకృతులు - వీరరాఘవ కవికృతులు విశాఖమండలమున నేటికిని ప్రచారములో నున్నవి. ఈతడు తన కృతులను వీరరాఘవస్వామికి నంకితము గావించియున్నాడు. తన గ్రంథమున గద్యయం దిట్లు చెప్పుకొనియున్నాడు.

ఇది శ్రీమద్వీరరాఘవేశ్వర వరప్రసాదలబ్ధ కవితామాధుర్యధుర్య శ్రీ శుక్లయజుశ్శాఖభారద్వాజగోత్రోద్భవ తోలేటి వంశపయః పారావార రాకాసుధాకర శ్రీకృష్ణమాభిఖ్య శ్రీ వేంకమాంబాతపః ఫలజనితసుకవి జనవిధేయ వీరరాఘవనామధేయప్రణీతంబైన శ్రీ వీరరాఘవకృతులు సమాప్తము.

మిక్కిలి ప్రచారములోనున్న 'వీరరాఘవా నా శతకల బావవా అను కృతియు, మేలుకొలుపులును నీ వీరరాఘవకవి రచితములే-సంఖ్య R 478.

చల్లా గురవయ్య కవి-యాజ్ఞవల్క్య విజయము-యాజ్ఞవల్క్యమహర్షి చరిత్ర ద్విపదకృతిగా నీకవి రచించెను. కొండవీటి స్థలకరణమగు కృష్ణపాత్రుని వెంకటమంత్రి కంకితముచేసెను. గ్రంథకర్త గురవయ్య ఆతని వంశ వృక్షమిది.




వీరి వాసస్థలము కొండపల్లి ఈతడు దుర్గా వరప్రసాదమున మహాకవియైనవాడు బాలసరస్వతీ బిరుదాంకితుఁడు.

## కృతిపతి కొండవీటి స్థలకరణము.

ఆతని వంశవృక్షము- కృష్ణాపాత్రుని వేంకటమంత్రి.




ఈ యాజ్ఞవల్క్యచరిత్ర ద్విపద యాఱుకాండములుగా విభజింపబడియున్నది. 1. జన్మకాండ 2. వేదకాండ 3. మైత్రేయకాండ 4. పరబ్రహ్మకాండ 5. యాజ్ఞకాండ 6. విశ్వజిత్కాండ

ప్రాచ్య లిఖితపుస్తక భాండాగార ప్రతి (R 498) లో మొదటి నాలుగు కాండములు సమగ్రముగాను అయిదవకాండ యసమగ్రముగా నున్నది.

కృష్ణాభ్యుదయము-గోటేటి నారన్న ప్రణీతము - బొల్లాప్రెగడ రామమంత్రికి కృతి-ప్రశస్తకృతి-నాల్గాశ్వాసములు-అముద్రితము. (R476)
(ప్రాచ్యలిఖిత భాండాగారము.)

# శ్రీయాజ్ఞవల్క్య యోగీశ్వర జన్మదినోత్సవ నిర్ణయము

శ్రీ యాజ్ఞవల్క్య భక్తవరులారా !

యాజ్ఞవల్క్య జన్మతిథి నిర్ణయమునుగురించి పలువురు పలువిధముల ప్రమాణరహితముగ వ్రాసియున్నారు. అస్మన్మాతామహులును, స్వశాఖీయవేదశాస్త్రాదిక గ్రంథ సంపాదనవిషయైక దేశాటనతత్పరులును, శ్రీ యాజ్ఞవల్క్య ప్రభావదర్పణము, శ్రీయోగి యాజ్ఞవల్క్య గీతయు, శ్రీకాత్యాయనీ కళ్యాణము మొదలగు గ్రంథ ప్రకాశకులును, శ్రీచిదంబర ప్రశిష్యులును, శ్రీ యోగీశ్వర యాజ్ఞవల్క్య పూజాధురంధరులును, చెన్న పట్టణస్థిత శ్రీ యాజ్ఞవల్క్యాలయ స్థాపకులును, గోదావరీమండలాంతర్గత "కుంచనపల్యా"ఖ్య గ్రామ నివాసులును అగు బ్రహ్మశ్రీ కూచిపంచాగ్నుల రాజమన్నారు శాస్త్రిగారి స్వహస్తలిఖిత గ్రంథ సంచయములో గనిపించిన వక్ష్యమాణ శ్లోకములనుబట్టి కార్తికశుద్ధ దశమి తిథియే శ్రీయాజ్ఞవల్క్య జన్మతిథిగా గనుపట్టుచున్నది.

శ్లో॥ ఊర్జేమాసి సితే యమే రవిదినే లగ్నే ధనుష్కేతథా
నక్షత్రే శతతారకే చ సుమహాన్ గర్భాత్తవేదో మునిః ।
రూపై సర్వగుణాదికః శ్రుతిమయో జాతస్సునందాత్మజః
సోऽస్మాకంవాజసనేయ రూపన్నహరిః కుర్యాత్సదామంగళమ్ ॥

[శాకల్యకృత యాజ్ఞవల్క్య పరమగురు మంగళాష్టకమ్]

యీ శ్లోకమందలి "యమే" అనెడు పదమునకు "దశమి తిథి" యుందనియే అర్థము చేసికొనవలయును. ఇందులకు ప్రమాణములను జూపుచున్నారము.

శ్లో॥ తిథీశో౽గ్నిర్విధిర్గౌరీ గణేశో౽హిర్గుహో రవిః ।
శివో దుర్గా౽న్తకో విశ్వే హరిః కామశ్శివశ్శశీ ॥

[ముహూర్తచింతామణి 8-వ శ్లోకము]

శ్లో॥ వహ్నిర్విధాతాద్రి సుతా గణేశః
సర్పో విశాఖో౽దితిజో మహేశః ।
దుర్గా యమో విశ్వహరీ చ కామః
శర్వో నిశేశశ్చ పురాణ దృష్టాః ॥

శ్లో॥ ప్రతిపద్యగ్ని పూజాస్యాద్ద్వితీయాయాం చ వేధసః ।
దశమ్యా మన్తకస్యాపి షష్ఠ్యాం పూజా గుహస్య చ ॥
చతుర్థ్యాం గణనాథస్య గౌర్యాస్తత్పూర్వవాసరే ।
సరస్వత్యా నవమ్యాం చ సప్తమ్యాం భాస్కరస్య చ ॥

అష్టమ్యాం చ చతుర్దశ్యా మేకాదశ్యాం శివస్య చ ।
ద్వాదశ్యాం చ త్రయోదశ్యాం హరేశ్చ మదనస్య చ ॥
శేషాదీనాం ఫణీశానాం పంచమ్యాం పూజనం భవేత్ ।
పర్వణీందోస్తిథిష్వాసు పక్షద్వయ గతాస్వపి ॥

[ముహూర్తచింతామణి వ్యాఖ్యాయాం అగ్నిపురాణే]

శ్లో॥ శరత్కార్తిక శుక్లే వై దశమ్యాం శతతారకే ।
రవేర్దినే ధనుర్లగ్నే లగ్నాదేకాదశే రవౌ ॥
యోగేశ్వరో మహాతేజా అవిర్భూతో౽తి సుందరః ।
తదానీం గగనే శబ్దం శుశ్రువుర్నిఖిలామరాః ॥

[స్కాంధపురాణము సనత్కుమార సంహిత]

శ్లో॥ అయాతయామ వేదేన జనాన్ సంబోధితుం సుధీః ।
వాయుర్వై యాజ్ఞవల్క్యేతి దేవరాతగృహే గురుః ।
కార్తికే శుక్లపక్షే చ దశమ్యా మిందువాసరే ।
జాతశ్చంద్రే చ హార్యృక్షే వవృధే సూర్యసన్నిభః ॥
[ఆదిత్యపురాణము. ఉత్తరఖండము. భృగుకర్దమ సంవాదము.]

శ్లో॥ విష్ణోర్వీర్య ప్రవృద్ధ్యై స్వయమపి భగవాన్ భారతీశ స్సమీరః ।
కార్తిక్యాం శుక్లపక్షే హరిభ దశతిథౌ యాజ్ఞవల్క్యేతిజజ్ఞే ॥
ఇందోర్వారే సునందా మసువ సుతనయం దేవరాతస్య పత్నీ ।
సాక్షాచ్ఛుక్లస్యదేవః స ఋషి రపి యతర్లాల్యపాద్వాజివేదే ॥
[బ్రహ్మగీతాయాం శాకల్యకృత స్తోత్రమ్]

ఇట్లు :

శ్రీకణ్వగురు వాజసనేయ యాజ్ఞవల్క్య భక్తజనవిధేయులు,

యువ సం॥ మార్గశిర
బ॥ ౮ భౌమవాసరే
17-12-1935.

కణ్వపురి సీతారామావధానులు,
ముద్దా రామశర్మ.

## (ಶ್ರೀ ಯಾಜ್ಞವಲ್ಕ್ಯ ವಿಜಯದಿಂದ)

## ಶ್ರೀ ಯಾಜ್ಞವಲ್ಕ್ಯರ ಜನ್ಮವೂ ಬಾಲಲೀಲೆಗಳೂ

ದೇವರಾತನು ಶಿವದರ್ಶನದಿಂದಲೂ, ಅವನ ವರದಾನದಿಂದಲೂ ಹರ್ಷ ಪೂರ್ಣವಾಗಿ ತನ್ನ ಗೃಹಸ್ಥಾಶ್ರಮ ಧರ್ಮವನ್ನು ಧರ್ಮಕ್ಕನುಸರಿಸಿ, ಪರಿ ಪಾಲನಮಾಡುತ್ತಾ ಕೆಲವು ಕಾಲವನ್ನು ಕ್ರಮಿಸಲು, ಭಕ್ತರ ಕಾಮಧೇನುವೂ ವಿಶ್ವೋದ್ಧಾರಕನೂ ಆದ ಪರಮೇಶ್ವರನ ಪ್ರಸಾದದಿಂದಲೂ, ಕೃಪೆಯಿಂದಲೂ ದೇವರಾತನ ಮನೋಭೀಷ್ಟವು ಸಫಲವಾಗುವ ಸಮಯವು ಶೀಘ್ರವಾಗಿ ಬಂದಿತು. ಪರಮೇಶ್ವರನಾದ ಶಂಕರನು ತನ್ನ ಅಂಶವನ್ನು ಜಗತ್ತಿನಲ್ಲಿ ಪ್ರಕಟಿಸುವದಕ್ಕೆ ತಡಮಾಡಲಿಲ್ಲ. ಕಾರ್ತಿಕ ಶುದ್ಧ ದಶಮಿ ಸೋಮವಾರದಿನ ದೇವರಾತನ ಪುಣ್ಯ ಫಲೋದಯವಾಯಿತು. ಸಾಕ್ಷಾತ್ ಶಿವನ ಅಂಶವೂ, ಬ್ರಹ್ಮಾದಿದೇವತೆಗಳ ತೇಜವನ್ನು ಧಿಕ್ಕರಿಸುವ ತೇಜಸ್ಸಿನ ನಿಧಿಯೂ ಆದ ಪುತ್ರನು ದೇವರಾತನನ್ನೂ, ಜಗತ್ತನ್ನೂ ಉದ್ಧರಿಸುವುದಕ್ಕಾಗಿ ಜನ್ಮವನ್ನು ತಾಳಿದನು.

ಅದೇಕಾಲದಲ್ಲಿ ಕೂಡಿದ ಪೂಜ್ಯರಾದ ಋಷಿಗಳ ಆಜ್ಞೆಯಪ್ರಕಾರ ತನ್ನ ಪುತ್ರನಿಗೆ 'ಯಾಜ್ಞವಲ್ಕ್ಯ' ಎಂಬ ನಾಮವನ್ನು ಇಟ್ಟನು.

ಯಾಜ್ಞವಲ್ಕ್ಯರ ಜಗನ್ಮಾನ್ಯವಾದ ಹತ್ತು ಶಾಸನಗಳು —

(1) ಅಹಿಂಸೆ (2) ಸತ್ಯ (3) ಅಸ್ತೇಯ (ಕಳ್ಳತನ ಮಾಡದೆ ಇರುವದು) (4) ಶೌಚ = ಅಂತರಂಗ ಬಹಿರಂಗಗಳಲ್ಲಿ ಶುಚಿರ್ಭೂತತೆ (5) ಇಂದ್ರಿಯ ನಿಗ್ರಹ (6) ದಾನ (7) ಧರ್ಮ (8) ದಯೆ (ಭೂತದಯೆ) (9) ಕ್ಷಾಂತಿ × ಕ್ಷಮೆ (10) ಆತ್ಮಜ್ಞಾನ.

# ప్రచురణకర్త స్వీయ చరిత్ర

నందననామ సం॥ కార్తీక శు 13 తారీఖున (2-11-1892) కృష్ణా జిల్లా బాపట్లతాలూకా పావులూరు గ్రామంలో మా మాతామహుడు అగు మద్దులూరి పరదేశి పంతులుగారి కొమారుడు శ్రీరాములుగారి యింట్లో జనన మొందితిని. మద్దులూరి పరదేశి పంతులుగారు రేపల్లె గోసూరు వినుకొండ వగైరా చోట్లలో కొండవీటి సీమలో తహశీల్దారుగా పని చేసి కొన్ని దినములు గవర్నమెంటు పెన్షను తీసుకొనియున్నారు. పెదకంచర్ల గ్రామంలో శివప్రతిష్ట చేసియున్నారు, యిప్పటికి పూజలు బాగా జరుగుచూవున్నవి. నేను పుట్టకముందే నా తండ్రిగారి స్వగ్రామమైన నెల్లూరుజిల్లా వంగోలుతాలూకా వృద్ధగుండితీర లింగముగుంట గ్రామంలోని ఆస్తియావత్తు పోయినది. నేను పావులూరిలో మా తాతగారి యింటిలోనే 1902 వరకు పూర్వపు తెలుగు వీధిబడిలో చదువుట అనగా సుమతిశతకము, బాలరామాయణము, ఎరుసులు వగైరా తెనుగు లెక్కలు యావత్తు జాగ్రతగా చదువుకున్నాను. 1902 వ సం॥ చదువుకొనుటకు లింగంగుంట వచ్చినాను. అప్పుడే మద్రాసు, బెజవాడ రైలు కొద్దికాలము క్రిందట వేసియుండుటవల్ల అప్పుడే నేను మొదట్లో రైలు చేటుపాళెం స్టేషనులో ఎక్కి వంగోలులో దిగినాను. 1902-1903 సంవత్సరములు వంగోలులో కొండక్రిందవున్న గవర్నమెంటు ట్రయినింగు స్కూలులో చదువుకొన్నాను. అప్పుడు జీతము 0-0-9 0-1-0 వుండేది. 1904 వ సం॥ గవర్నమెంటువారిచే జరిపిన ప్రేమరి పరీక్షలో మొదటి తరగతిలో సుత్తీర్ణుణ్ణిని అవుటవల్ల 1905, 1906, 1907 సంవత్సరములకు గవర్నమెంటువారు Scholar ship యిచ్చినారు. 1904to1907వరకు వంగో



లింగంగుంట వెంకటసుబ్బయ్య.

ప్రచురణకర్త.

లులోవుండే పిఠుపాటి వెంకటరంగయ్యగారి మిడిలిస్కూలులో చదివినాను. 1904 సం॥ దావులూరి లక్ష్మీనారాయణగారు మేష్టరుగా వున్నారు. 1905 to 1907 వరకు నాకు మేష్టరుగా వుండే కురుగంటి శ్రీరామశర్మగారు వృద్ధగుండి తీరలింగమగుంటువాసు అని పిలిచేవారు. 1907 వ సం॥ రంలో లోయర్ శెకండరి పరీక్ష ప్యాసయినాను. వంగోలులో చదువుకొనుటకు వసతిలేక గుంటూరు గ్రామం 1908 వ సం॥ జనవరిలో వచ్చి గుంటూరు అన్నసత్రంలో 4 సంవత్సరములు భోజనము వుచితముగా యిచ్చినారు. గుంటూరులో చదువుటకు వచ్చినది మొదలు బాపట్లతాలూకా వాడరేవు గ్రామకాపురస్తుడు నా పిన్నతల్లి భర్త అయిన కోజ శీతారామయ్యగారు జీతము యావత్తు యిచ్చినారు. నా తాతగారు మద్దులూరి శ్రీరాములుగారు పుస్తకముల ఖర్చులు వగైరాలు జరిపినారు. నేను గుంటూరులో ప్రస్తుతము హిందూ కాలేజి హైస్కూలు అని వ్యవహరిస్తూ అప్పుడు సంస్కృత హైస్కూలులో 1908 to 1912 వరకు చదువుకున్నాను. 1911 వ సం॥లో మార్చి పరీక్షకు S. S. L. C.కి హాజరుఅయినాను. అంతకుముందు మెట్రికులేషను పరీక్ష వుండి డిశంబరునెలలో జరుగు చుండెడిది. మార్పు ఆ సంవత్సరమునుంచి వచ్చినది. 1909 వ సం॥లో నా వివాహము జరుగుటవల్ల తరువాత నా తండ్రిగారు చనిపోవుటవల్ల, గృహచిక్కులు మనశ్శాంతి లేకపోవుటవల్ల కొన్ని సబ్జక్టులో మార్కులు రానందున 1912 వ సం॥ మార్చినెల పరీక్షకు హాజరయి పూర్తిచేసుకున్నాను. తర్వాత భార్య కాపురానికి వచ్చినందువల్ల వుద్యోగముకొరకు చాలా చోట్ల ప్రయత్నము చేసినాను. చివరకు 1912 వ సం॥ నవంబరు నెలలో నర్సరావుపేట సబ్ రిజిష్ట్రారు ఆఫీసులో శెక్షను రయిటరుగా చేరినాను. జీతము రూ 12-0-0 లు. 1913 వ సం॥ జనవరి 1-వ తేది నుంచి గుంటూరు నెల్లూరు జిల్లాలు ఒక జిల్లా రిజిష్ట్రారు క్రిందనే వుండుటవల్ల నన్ను నెల్లూరు జిల్లా వుదయగిరికి గుమాస్తాగా వెళ్లుతావా అని అడుగగా వెళ్లుతానని చెప్పి ఆర్డరు తీసుకొని వచ్చినాను. ఆ దినములలో అనగా

1913 వ సం॥ రం లో మార్చి నెల 2 - 3 తారీఖులలో కావలినుంచి వుదయగిరి పేర్కుటకు ప్రయాణము కష్టముగా వుండేది. రాత్రి 7 గంటలకు 40-50 బండ్లు పోలీసు బందోబస్తుతో కావలినుంచి కలిగిరి వచ్చేవి. నేను ఆ బండ్లలో రాత్రియావత్తు 30 మైళ్ళు ప్రయాణము చేసినాను. 1913-వ సం॥ మార్చి నెల 7-వ తారీఖున వుదయగిరి సబ్ రిజిష్ట్రారు ఆఫీసులో అక్టింగు గుమాస్తాగా చేరినాను. అప్పుడు జీతం రు 12-0-0 లు అయితే యిప్పుడు 200, 300 రూపాయల కంటె విలువ యెక్కువ. ఖజానాలో సవర రు 10-0-0 లుకు యిస్తూవుండేవారు. 1918-వ సం॥ 21 ఏప్రిల్ తారీఖున గుమాస్తాపని ఖాయము అయి అక్కడ 1914 సం॥ మేనెల వరకు వున్నాను. మా నాయనగారు వెంకట్రామయ్య, మాతల్లి శేషమ్మ, నాకు తమ్ములు యిద్దరు వుండేవారు. 1. యజ్ఞనారాయణ, 2. కోదండరామయ్య, 2-వ అతను ఇంటర్ మిడియేటు చదువుచూ చనిపోయినాడు. 1. యజ్ఞనారాయణ భార్య 1947వ సం॥లో ఒక్కటే తడవ చనిపోయినారు. వారికి యిద్దరు కొమాళ్లు వున్నారు. (1) వెంకట సత్యనారాయణ, (2) వెంకటశేషాచలపతి. పెద్దఅతను మాజేటి గురవయ్య హైస్కూలులో డ్రిల్లుమాష్టరుగా వున్నాడు.

1914-వ సం॥ మే నెలలో వుదయగిరినుంచి నూజూరుపేటకు మార్చివారు. అక్కడ అక్టోబరువరకు వున్నతరువాత బుచ్చిరెడ్డిపాళెం మార్చినారు. అక్కడ ఒక సంవత్సరము వున్నతర్వాత గుంటూరుజిల్లా రిజిష్ట్రారు ఆఫీసుకు మార్చినారు. 1914-వ సం॥ డిసంబరు నెలలో నన్ను తన ప్రాణముకంటె యెక్కువగాచూచే మా పినతల్లి కాజ వెంకట లక్ష్మమ్మ స్వర్గస్థురాలు అయినది. నేను గుంటూరు వచ్చేవరకు నా తమ్ముడు లింగంగుంట యజ్ఞనారాయణ ప్లీడరు గుమాస్తాగాచేరి వాడి జీవితము స్వేచ్ఛగా జరుపుతున్నాడు. గుంటూరులో కోనేటిదగ్గర మొరుసుపల్లి కొండలరావుగారి యింట్లో కాపురము వున్నాము. నా ప్రథమభార్య రంగమ్మ వున్నది. ప్రస్తుతం ఆయిల్లు సత్యనారాయణస్వామి దేవాలయం.



ప్రచురణకర్త (ప్రథమ భార్య) కీర్తిశేషురాలయిన

లింగంగుంట రంగమ్మ.

1917-వ సం॥ రంలో నన్ను గుంటూరునుంచి సంతనూతలపాడుకు గుమా స్తాగా మార్చినారు. అక్కడినుంచి రేపల్లెకు ట్రాన్సుఫరు చేసినారు, 1919-వ సంవత్సరంలో గుంటూరుకు ట్రాన్సుఫరు చేసినారు. అదిమొదలు 1922 వరకు గుంటూరులో వున్నాను. యీలోపల మా ముత్తాతగారైన మద్దులూరి పరిదేశి పంతులుగారు వుద్యోగముచేసిన క్రోసూరు గ్రామంలో సబ్ రిజిష్ట్రారుగా పనిచేసినప్పుడు మా తాతగారుకూడవుండి చాలా సంతోషపడినారు. యింకోసంగతి నా ప్రథమభార్య పేరు మా తాతగారి తల్లి పేరు రంగమ్మ అగుటవల్ల చాలా గౌరాబముగా చూచేవారు. వారు కూడా నేను వుద్యోగము చేసిన వూళ్ళు అన్ని చూచి ఆనందముగా గడిపినారు. 1922_1924 వరకు వంగోలు సంతనూతలపాడు, పొన్నూరు వగైరా గ్రామాదులలో సబ్ రిజిష్ట్రారుగాచేసి 1924 అగస్టుకు గుంటూరు జిల్లారిజిష్ట్రారు ఆఫీసుకి గుమాస్తాగా ట్రాన్సుఫరుచేసినారు. 1924 మొదలు 1942అక్టోబరు 29 వరకు అక్కడనే వుంటూవచ్చినాను. 1924-వ సం॥ డిసంబరు నెలలో నా ప్రథమభార్య రంగమ్మ స్వర్గస్తురాలు అయినది. ఆమెకు సంతులేదు. 1925-వ సం॥ మేనెలలో తెనాలితాలూకా పెద రావూరుగ్రామ కాపురస్తుడు రావూరి వెంకయ్యగారి తృతీయ కుమార్తె అన్నపూర్ణమ్మను యిచ్చి ద్వితీయ వివాహము జరిగినది. యిద్దరు మొగ పిల్లకాయలు కలిగిపోవుటవల్ల అప్పుడు మద్రాసులోవున్న రిజిష్ట్రారు డిపార్టుమెంటు ఇన్స్పెక్టరు రామలింగపిళ్ళగారి సలహావలన 1930-వ సం॥ జనవరిలో రామేశ్వరమువెళ్ళి నాగప్రతిష్టచేసి వచ్చినతర్వాతకల్గి ప్రస్తుతం (1) పెద్దకుమార్తె వెలగపూడి వెంకటపర్వతవర్ధని రంగనాయకమ్మ (2) వెంకట సీతారామాంజనేయులు (3) వెంకటలక్ష్మి సావిత్రి అను వారు వున్నారు. పెద్ద కుమార్తెకు (1) శ్యామచంద్ర సురేష్‌బాబు (2) నవనీతరోహిణికుమారి అని మొగపిల్లవాడు ఆడపిల్ల కలరు. 1931-వ సం॥ లో మా పినతండ్రి రామారావుగారి సంగతి కనుక్కొనుటకు వెళ్ళి కాశీ, గయా, ప్రయాగ, పూరి, సింహాచలము, తాతానగర్, జమ్షెడ్

పూరు చూచి ప్రయాగలో కాశీగంగ తీసుకొనివచ్చినాను. 1937-వ సం॥ లో కుటుంబ సహితముగా రామేశ్వరమువెళ్ళి రామలింగేశ్వరుడికి అభిషేకముచేసి వచ్చినాను. 1937-వ సం॥ మేనెలలో బ్రాడిపేటలో స్వంతయిల్లు కట్టుకొని గృహప్రవేశము అయినది. కాశీగంగ 8 సంవత్సరములు మా యింట్లోవున్నా చెడిపోకుండా వున్నది. పళని పంచామృతము 1 సంవత్సరమున్న చెడిపోకుండావున్నది. 1940-వ సం॥ నాకు చాలా జబ్బుచేసి మతి చాంచల్యము వచ్చినందున 1941-వ సం॥ జూలై 1-వ తారీఖు నుంచి సెలవుమీద వుండి 1942-వ సం॥ అక్టోబరు 29-వ తారీఖున గుంటూరు జిల్లా మెడికల్ ఆఫీసరుగారు Invalid Certificate యిచ్చినందున పెన్షను తీసుకుంటూవున్నాను. 1944-వ సం॥ మే నెలలో నా ప్రథమ కుమార్తె వివాహం జరిగినది. 1945-వ సంకే మేనెలలో నాతల్లి శేషమ్మ చనిపోయినది. 1950-వ సం॥ నాయిల్లు దక్షిణప్రక్కన శ్రీ ప్రసన్నాంజనేయులను ప్రతిష్టచేసినాను. 1952-వ సం॥ డిసంబరు నెల 19-వ తేది వుద్యోగము కొరకు మద్రాసుకు వచ్చినాను. 1953-వ సం॥ జనవరిలో గవర్నమెంటు ఓరియంటల్ లైబరి క్యూరేటరుగారిని చూచినాను. వారు వెంటనే వ్రాతపని చూపించినారు. ఆ దినము మొదలు యిప్పటివరకు జీవితము చక్కగా జరుగుచున్నది. మా శాఖయందు అభిమానముపుండి మా పూర్వీకులు వ్రాసిన యాజ్ఞవల్క్య చరిత్ర, చతుర్వాటికా మహాత్మ్యము వగైరా పుస్తకములు అచ్చువేయించవలయునని అభిలాష వుండివున్నది. అయినను సామాన్యుడను ధనములేదు. యాజ్ఞవల్క్య ఋషిగారి దయ ఆంజనేయస్వామి శ్రీరామ ఏసుబాబా, సాయిబాబా వగైరా పెద్దల దయవల్ల యీ యాజ్ఞవల్క్య చరిత్ర లైబ్రరిలోవున్న వ్రాత ప్రతి No. 20 L. 154, 491ని అనుసరించి క్యూరేటరుగారి పర్మిషన్ in R.C. Date 19-1-54ను పొంది అచ్చువేయించి అందుబాటులో చౌకధరకు మీ అందరికి అందచేయుచున్నాను. తాటియాకుల ప్రతులలో కొన్నిచోట్ల ఖాళీగా వున్నది వున్నట్లుగా వేయుచున్నాను. పరిచూచు

టకు వేరే కాపీకూడా లైబ్రరిలో లేదు. కాబట్టి పాఠకులందరు అభిమానించి తప్పులు క్షమించవలెనేంది. పండితులచే చాలాభాగము పరీక్షించబడినను కొన్ని లోపములు వున్న రెండవ ముద్రణలో సవరించెదను. కాబట్టి యాజ్ఞవల్క్య మహాఋషి అని చట్టములు వారి స్మృతులను ఆధారపడియుండి ప్రస్తుతం హిందు లా కూడా దీనిలోనుంచి క్రోడీకరింపబడినవి గనుక అందరు కావలసినదని ప్రార్థిస్తూవున్నాను.

యీ పనికి ప్రోత్సహించి అడుగగానే పరిమిషన్ యిచ్చినటువంటి గవర్నమెంటు వ్రాతప్రతిలైబ్రరి క్యూరేటరు శ్రీ టి. చంద్రశేఖరన్ యమ్. ఎ. గారికిన్ని, నన్ను ప్రోత్సాహించి విపుల పీఠిక వ్రాసినటువంటి మద్రాసు విశ్వవిద్యాలయ తెనుగు శాఖాద్యక్షులు శ్రీ నిడదవోలు వెంకటరావు, యమ్. ఏ. గారికి, అచ్చువేసి సరిచేసియిచ్చిన రత్నం ప్రెస్ మానేజరు గారికి, అడుగగానే మద్రాసు పెద్దినాయకునిపేట పట్టాభిరామయ్య వీధి 2-వ నెంబరు మందిరములో వుండే శ్రీ యాజ్ఞవల్క్యఋషి ఫోటోను తీసుకొని యీ పుస్తకములో వేసుకొనుటకు అనుమతి యిచ్చిన దేవాలయము అధికారిగారికిన్ని, నేను అడుగగానే వారి అభిప్రాయములు వ్రాసియిచ్చినటువంటి నా స్నేహితులకు యావత్తుమందికి అనేక వందనములు.

ఇట్లు :

లింగంగుంట వెంకటసుబ్బయ్య.

# పండితుల యభిప్రాయము

శ్రీ లింగంగుంట వేంకటసుబ్బయ్యగారు వ్రాతప్రతిని జాగ్రత్తగా పరిశీలించి సాధ్యమయినంతవఱకు నిర్దుష్టముగా సవరించి ప్రకటించిన ఘట్టుప్రభునామధేయప్రణీత యాజ్ఞవల్క్య చరిత్రమును చదివి గ్రంథమును గూర్చి నాకు తోచిన యభిప్రాయములను తెలియజేయుచున్నాను. ఘట్టుప్రభువు విద్వత్కవి. ఆంధ్ర గీర్వాణభాషా పాండిత్యముగల మేధావి, ఈతని కవిత్వము ద్రాక్షాపాకమున మిగుల హృద్యముగానున్నది. భాషలో భావగాంభీర్యముగలదు. క్లిష్టతలేదు. సాహిత్యపరిచయ మేమాత్ర మున్న వారికైనను సులువుగా బోధపడగల సులభశైలిలో ఈ కావ్యము రచితమైనది. పద్యములన్నీ - వృత్తము కానిండు, జాత్యుపజాతి పద్యములే కానిండు-ధారాప్రవాహమువలె నడచును. అందులోను ఇందలి సీసపద్యములు శ్రీనాథుని సీసపద్యములవలె కడు హృద్యముగా రచితములయినవి. ప్రతిపద్యమందును ఏదో ఒక అలంకారమో చమత్కృతియో దొడ్డభావమో కల్పనయో గోచరించుచుండును. కావ్యమంతా మనోహరమయినదే. అందును గర్గీ యాజ్ఞవల్క్యుల సంభాషణము ఎక్కువ చక్కగా వర్ణింపబడినది.

ఘట్టుప్రభువు ప్రథమశాఖాభిమానముతో రచించిన యీ యాజ్ఞవల్క్య చరిత్రకావ్యము ప్రథమశాఖవారికే కాక తక్కినవారికిని రుచింపగల కావ్యము గలదని నా దృఢ విశ్వాసము.

ఈ గ్రంథమును ముద్రింపించి తెలుగువారికి అందజేసిన శ్రీ లింగంగుంట వెంకటసుబ్బయ్యగారికి నా ధన్యవాదములు. ఈ కావ్యము ఆంధ్ర సాహిత్యమందు ఉన్నతస్థానమును పొందగల దనుటకు సందియములేదు.

మద్రాసు-౮,
4-1-౫౫.

డాక్టర్ గిడుగు వేంకటసీతాపతి,
బి.ఏ., ఎల్.టి., డి.లిట్.
ప్రధాన సంగ్రాహకులు, తెలుగు విజ్ఞాన సర్వస్వము.
తెలుగు భాషాసమితి.

వేదములలోఁ బ్రథమమగు యజుర్వేదము, అందు శుక్లయజుర్వేద ప్రవర్తకుఁడగు శ్రీ యాజ్ఞవల్క్య మహర్షి చరిత్రము, అద్భుతానంద విజ్ఞానదాయకము యల్లనామాత్య పుత్రుండగు ఘట్టుప్రభు కవివరేణ్యుండు దీని నాంధ్ర పద్యకావ్యముగ రచియించి, ప్రాతకోట మహాగ్రామ మంత్రి మణియైన, ఉద్దండలింగయామాత్యునకుఁ గృతి నొసంగెను. కవిత్వము ధారాశుద్ధిగలిగి పూర్వకవిప్రయోగ శబ్దానుబంధబంధురమై, మృదు లలితపద శోభితమై, కథాసందర్భోచిత వివిధరస, భావోల్లసితమై, చదువం జదువ నానందోత్సాహజనకమై యొప్పారుచుండెడిది. చెన్నపురీ ప్రభుత్వ ప్రాచ్యగ్రంథ భాండాగారముననుండు వ్రాత ప్రతినిఁ జూచి వ్రాయుటవలన, నచ్చటచ్చట లుప్తాక్షరములు, పదములు స్ఖాలిత్యములు, పెక్కులు గన్పించుచున్నవి. ద్వితీయ ముద్రణభాగ్యము లభించుచోని వాని నన్నింటిని సవరించి నిర్దుష్టముగ పాఠకజనహృద్యముగ ముద్రింపఁబడును. కృతిపతియగు ఉద్దండలింగయామాత్యుఁడు ప్రథమశాఖాన్వయ జనితుం డును, తదభిమానవంతుండు నగుటంజేసి, తచ్ఛాఖాప్రవర్తకులు (శుక్ల యజుర్వేదీయ) అగు శ్రీయాజ్ఞవల్క్య మహర్షి చరిత్రమును రచియింపఁ జేసి అంకితము నొందెను. కథ అతి మనోహరము పరమపవిత్రము బ్రహ్మ రాతి తేజమున, సునందాగర్భంబున, అయిదు సంవత్సరములుండిన శిశు వునకు, శ్రీమన్నారాయణుండువచ్చి బ్రహ్మోపదేశము సేయుట; మాతృ గర్భంబు వెడలిన శిశువునకు, కణ్వ మార్కండేయ, గౌతమ వసిష్ఠాది మహ ర్షులు, యాజ్ఞ్యవల్క్య యను నామధేయము సేయుట, వేదవేదాంగాది సకల విద్యలు వైశంపాయనునివద్దఁ జదువుట, వైశంపాయనునకు బ్రహ్మహత్యా పాతకము సంభవించునపుడు, తన తపఃప్రభావంబునఁ బోఁగొట్టుట, విదేహ జనకచక్రవర్తి మందిరమునకుంజని, మంత్రాక్షత స్పర్శనమాత్రంబున, సభాస్తంభంబులఁ బుష్పింపఁజేయుట, గురువాక్యోల్లంఘనంబునఁ జదివిన విద్య గ్రక్కుట, గాయత్రి నారాధించి, సూర్యునివద్ద శుక్లయజు ర్వేదము నేర్చుకొనుట, సూర్యస్తుతి, సూర్యదండకము, గాయత్రీస్తోత్రము

గావించుట, కాత్యాయని యను కన్యకను వివాహమగుట, జనక చక్రవర్తి యజ్ఞముసేయుచు, వివిధ ప్రదేశములనుండి, బ్రాహ్మణోత్తములు, మహర్షులు విచ్చేసియుండు సభామధ్యమున, కొమ్ములకు స్వర్ణము నలంకరించిన, సహస్రాధిక గోవులనుఁ జూపి మీలో నెవరు బ్రహ్మనిష్టులో వారీ యావులనుఁ దోలుకొని పోవచ్చునని చెప్పినంతట, వారిలో నెవరును ధైర్యముఁ జాలక ముందుపడరైరి. ఇట్లుండ యాజ్ఞవల్క్య మహర్షి తన శిష్యునిఁబిలిచి యీ గోవులను ఇంటికిఁ దోలుకొని పొమ్మని యాజ్ఞనొసంగె. అంతట తక్కిన బ్రాహ్మణులు, అసూయాగ్రస్తులై, యీ యాజ్ఞవల్క్యుం డెట్లు బ్రహ్మనిష్ఠుడని అశ్వలుఁడు, కహోళుఁడు, ఉద్దాలకుఁడు, శాకల్యుఁడు లోనగు పలువురు, బ్రహ్మస్వరూపమును ఆత్మతత్త్వమునుగూర్చి వివిధ ప్రశ్నలు వేయగా, వారికి తగు జవాబులు (సదుత్తరములు)చెప్పి యోడించెను. వారెల్లరు నమస్కరించి విధేయులై బ్రహ్మపసుపున, పరిభవింప వచ్చిన గార్గియు ప్రతిఘటింపఁజాలక కూడియుండెను. జనకచక్రవర్తి యీ యాజ్ఞవల్క్యుని, బ్రహ్మనిష్ఠుఁడని తెలిసి వివిధప్రశ్నలు వేసి, తృప్తిఁజెంది తన విదేహరాజ్య మొసంగినను గైకొనకయుండెను. ఆమహర్షికి శిష్యుడై యుండెను. శుక్లయజుర్వేదీయ బృహదారణ్యోపనిషత్తు నదంలి తృతీయ, చతుర్థాధ్యాయ బ్రాహ్మణములందు శ్రీ యాజ్ఞవల్క్య మహర్షి ప్రతిపాదించి వివరించిన, బ్రహ్మస్వరూపము, ఆత్మతత్త్వము బ్రహ్మవిద్యావిచారము, అపారమహిమ గలవి. మైత్రేయీ బ్రాహ్మణమునందును, మైత్రేయీకి బ్రహ్మవిద్యా స్వరూపము బోధించెను. ఈ మహర్షి ప్రభావము వర్ణనాతీతము. యాజ్ఞవల్క్యస్మృతి యను పేరిట ధర్మశాస్త్రమును రచియించెను. ఇందు ఆచార, వ్యవహార, కర్మకాండలు వివరింపఁబడినవి. పరమ పవిత్రమగు ఈ యాజ్ఞవల్క్య చరిత్రమును గుంటూరు పురవాస్తవ్యులు రిజిష్టేషన్ శాఖనుండి విరమించిన, మ-రా-రా-శ్రీ, లింగంగుంట వెంకటసుబ్బయ్యగారు మిగుల వ్యయప్రయాసలకోర్చి అధికశ్రమఁ దీసికొని, ప్రథమ శాఖీయులవారి గురు చరిత్రమును ముద్రింపించి సంస్తవనీయుఁడై

యుండిరి. అదియునుంగాక, చతుర్వాటికామాహాత్మ్యము, చీరాలచరిత్ర, యాజ్ఞవల్క్య చరిత్ర వచనము, శ్రీరంగమాహాత్మ్య వచనము, లోనగు అపూర్వ గ్రంథములు ముద్రింపించి, సర్వజనోపకారముగ ప్రకటింపఁ దలంచిన శ్రీ వెంకటసుబ్బయ్యాగారికి, శాఖాభిమాన సుజనులు, సరస విద్వజ్జన కవిపండితవరేణ్యులు, వదాన్యులగు ధనసంపన్నులు, తగు సహాయ్య మొనరించి వారి యుద్యమమునకుఁ బ్రోత్సహింతురని కోరు చున్నాఁడను.

ఇట్లు : బుధ విధేయుడు,

వంగోలు, 7-9-1954. } విద్యాశేఖర, మన స్తత్త్వజ్ఞ, దైవజ్ఞరత్న, పండిత ముక్తినూతులపాటి గోపాలకృష్ణశాస్త్రి

---

శ్రీ లింగంగుంట వెంకటసుబ్బయ్యగారు శ్రమతో ప్రచురించుచున్న గట్టుప్రభువు ప్రణీతంబైన శ్రీ యాజ్ఞవల్క్య చరిత్ర వ్రాతప్రతి చూచి తిని. పూర్వకవి ప్రణీతంబైన ఈ ఋషి చంద్రుని చరిత్ర పాఠకలోకమున కందుబాటగుట మన అదృష్టమనవలెను. ఆ మహనీయుని పావన చరిత్ర యటులుండ, అందుగల సూర్యదండక స్తోత్రములు, గాయిత్రి స్తోత్రము అత్యంత ప్రాముఖ్యము వహించుచున్నవి. నిత్యజీవనమునందు స్త్రీ పురుష భేదములేక సర్వులు పారాయణముజేసి సత్ఫలము సులభముగ బొంద వచ్చును. శ్రీవారిచరిత్ర చదివినకొలఁదియు, మంత్రాత్మతాస్పర్శనమాత్ర మున జనకమహారాజ సభాస్తంభముల పల్లవింపఁజేసిన అమ్మహాఋషి దివ్యమహిమను తెలియవీలగుచున్నది. హృద్యమమై యొప్పారు నీ కావ్యము సర్వజనాదరణీయమై వెలయగలదు.

భద్రాచలం. 1-4-54. } ఆర్. హెచ్. డి. ప్రసాదరావు, బి. ఏ., ఎల్. టి. గజిటెడ్ హెడ్‌మాష్టరు.

యాజ్ఞవల్క్యుని చరిత్రము తెలుగులో పద్యకావ్యముగా వ్రాసిన గట్టుప్రభువు తెనుగు కవులలో ఉద్దండుడు. యాజ్ఞవల్క్యుడు తపస్సుచేసి సిద్ధిపొందిన మహాముని యేగాక ఆనాడు అమలులోఉన్న న్యాయసిద్ధాంతము లన్నింటిని క్రోడీకరించి స్మృతిరూపముగ మనకు యిచ్చినవాడు. కేనే మహాశయుడు ఉదహరించినట్లు మనుస్మృతిలోకంటె యాజ్ఞవల్క్య స్మృతి లోనే న్యాయసిద్ధాంత సమీకరణ సరళముగను, నియమబద్ధముగను ప్రస్ఫుటముగను ఉన్నది.

1914 లో ప్రీవీకౌన్సిల్‌వారు తీర్పుచేసిన విఖ్యాతమైన రామచంద్రుని కేసులో తీర్పు చెప్పుచూ అమీర్ అలీగారు ఈ యాజ్ఞవల్క్యుడు 2-వ శతాబ్దమునకు చెందియుండవచ్చని పేర్కొనియున్నారు. 3-వ శతాబ్దములో వ్రాయబడిన పంచతంత్రములోకూడా ఈ స్మృతిలోని కొన్నిభాగములు పొందుపరుపబడియున్నవి. అంతేకాకుండా 10-వ శతాబ్దమునకు పూర్వమే వ్రాయబడిన అగ్నిపురాణములోకూడ ఈ స్మృతిలోని ముఖ్యఘట్టములు యధాతధముగా పొందుపరుపబడియున్నవి. 10, 11-వ శతాబ్దములనాటి శిలాశాసనములలోకూడ ఈ స్మృతిలోని భాగములు కొన్ని నిర్వచింపబడియున్నవి. అనగా ఆనాడు మనుస్మృతినికాదనియే వ్యవహారము లన్నిటిలోను యాజ్ఞవల్క్యుని స్మృతియే సర్వ వ్యవహారముల పరిష్కారమునకు న్యాయశాస్త్రముగ ఉపకరించుచుండెను.

తదుపరి 11-వ శతాబ్దము లగాయతు ఈ యాజ్ఞవల్క్యుని స్మృతిపైననే విశ్వరూపుడు, విజ్ఞానేశ్వరుడు, అపరార్కుడు, శూలపాణి, మిత్రమిశ్రుడు మొదలైన విఖ్యాతవ్యాఖ్యాతలు వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఆయా వ్యాఖ్యానములు ఆయా ప్రదేశములలో ఆనాడు అమలులో ఉన్న న్యాయసూత్రములను అనుసరించి ఉండుటచేత అవియే న్యాయసిద్ధాంతములై వ్యవహార పరిష్కారమునకు న్యాయస్థానములలో ఉపకరించుచున్నవి. విజ్ఞానేశ్వరుడు వ్రాసిన వ్యాఖ్యానమునకు మితాక్షర అని

పేరు. ఆమితాక్షరయే నేడు యావద్భారతములో దాయభాగ న్యాయ సిద్ధాంతములు అమలులో ఉన్న ప్రదేశములలో తప్ప మనకు నేటి వ్యవహారపరిష్కారమునకు సిద్ధాంతములై ఉన్నవి.

ఇంతటి ప్రాశస్త్యముకల్గిన యాజ్ఞవల్క్య మహాముని చరిత్రమును తెనుగులో వ్రాసిన కావ్యముగ చాల కాలమునుంచి మరుగుపడి యున్నప్పటికిన్ని దానిని 'తమసో మా జ్యోతిర్గమయ' (చీకటిలోనుంచి వెలుగులోనికి తెచ్చి) అచ్చువేసి మనందరికి అందుబాటులోనికి తెచ్చిన శ్రీయుతులు లింగంగుంట సుబ్బయ్యగారి కాంధ్రులెల్లరు నిరంతరము కృతజ్ఞులు.

గుంటూరు,
12-6-1954.

శ్రీ వెంకటేశ్వర కొండవి,
అడ్వకేటు,

శ్రీ లింగంగుంట వెంకటసుబ్బయ్యగారికి నమస్కారములు మీరు ప్రచురింపనున్న యాజ్ఞవల్క్య చరిత్రలోని కొంత భాగమును జదివితిని. అందలి కవిత్వము ప్రాచీన పద్ధతి ననుసరించినదని వేరుగఁ జెప్ప నక్కర లేదు. విషయములు సర్వజనులు ననుసరింపదగిన వనేకమున్నవి. కొన్ని విషయములు నవీనులు ఆదరించు పద్ధతిలోనిదికాదని తోచును. కాని, ఆ విషయములు అనుసరింపఁబడినపుడు ఫలితము తెలియఁగలదు. ఇట్టి గ్రంథము లెన్నేని గలవు. వానిని బరిశీలించి ప్రచురించుట ముఖ్యము. బాహ్యదృష్టిని గొన్ని సామాన్యముగఁ దోచినను విషయానుసరణమునఁ గాని వానిలోని మహిమ వెల్లడికాదు. ఈ గ్రంథములోని విషయము లట్టివి. ఇట్టి కావ్యముల నింక నెన్నేని బ్రచురింప మీరు పూనుదురని నా యాశయము.

ఇట్లు:

మదరాసు,
25-6-54.

సింగరాజు రామలింగ శాస్త్రి,
తెలుగు డిపార్టుమెంటు, పచ్చయప్ప కళాశాల.

ఆర్యా !

తాము దయతో పంపిన యాజ్ఞవల్క్య చరిత్రమును ప్రథమ ద్వితీయాశ్వాసములను పఠించినాను.

ఆస్తికత్వమునకు ఎక్కువ వ్యాప్తి కావలసిన కాలమిది. ధర్మమును ప్రతిపాదించి జ్ఞానభిక్ష ననుగ్రహించిన మహా ఋషుల చరిత్రము లెంతయు ఆవశ్యకములు. మనది మహర్షి సంప్రదాయ మగుటను ఆర్షభక్తిని కలిగి ప్రవర్తించుట మన కర్తవ్యము. ఆంధ్రకవులు తలపెట్టి మనకు దయచేసిన తపస్విజన వృత్తములు చాల తక్కువ. వాల్మీకిచరిత్ర మున్నగునవి కొలదిగ మున్నవి. ఘట్టుప్రభువు కుచేలోపాఖ్యానము, పురాభాండేశ్వరము, యాజ్ఞవల్క్య చరిత్రము అను మూడు పద్యకావ్యముల రచించి "భ్రమరాంబికావర ప్రథమ దివ్యకవిత్వ విద్యాప్రవీణత వెలసినాడని వ్రాసికొనినాడు. ఈ కవి గ్రంథములలోని యాజ్ఞవల్క్య చరిత్రమును, మద్రాసు నందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండారమునందున్న దానిని ప్రకటించుటకు తాము పూనుకొనుట ప్రశంసింపదగియున్నది.

శ్రీ నిడదవోలు వేంకటరావుగారి సంపాదకత్వమున నీబ్రహ్మవిద్యానవద్యుని చరిత్ర వెలయుటవలన తెనుగువారు ప్రాచీన భారతౌన్నత్యమును తెలిసికొని ఉత్తేజితులగుదురని నా విశ్వాసము. (నా చదివినంతవట్టు విన్నవింతును).

యాజ్ఞవల్క్య చరిత్రమునందలి కవిత్వము సహృదయహృదయాహ్లాదకముగనున్నది. భాషసరళము. మంచి జాతీయములతోడను నిండియున్నది. ధారాశుద్ధిగల రచనము వచనముకూడ ప్రౌఢముగనున్నది.

యాజ్ఞవల్క్యమహర్షి మహత్త్వమును చక్కగ చాటి చెప్పుచున్న దీ చరిత్రము పరమపవిత్రవర్తనుల ఆత్మసంయమనము నైతికజీవనవిధానము వెలింగించు నీ యుత్తమగ్రంథ ప్రచ్ఛన్నతను పోగొట్టి ప్రకాశమునకు తెచ్చు ఉదారాశయులగు విద్యాధికుల కొనియాడుచున్నాను.

గుంటూరు,
1-9-54.

మండలపర్తి ఉపేంద్రశర్మ,
హిందూ కాలేజి, ఆంధ్రా యూనివర్సిటీ,

శ్రీ లింగంగుంట వెంకటసుబ్బయ్యగారు ప్రకటించు ఘట్టుప్రభువు విరచిత యాజ్ఞవల్క్య చరిత్రమును గాంచితిని. ఇట్టి ప్రాచీన కృతుల ప్రచురణలు భాషా కలంకారప్రాయమనుట నిర్వివాదాంశము. భాషాభిమానులును, యాజ్ఞవల్క్యశాఖీయులును వీరిని ప్రోత్సహించి ఆదరాభిమానములు చూపుదురుగాక! ఇందలి గాయత్రీస్తుతి, సూర్యమండలము మున్నగు స్తోత్రములు పఠనార్హములు.

ఇట్లు:

మద్రాసు,
2-9-'54.

వై. పరశురామయ్య,
తెలుగు లెక్చరరు, పచ్చయప్ప కళాశాల.

# విషయసూచిక

॥ శ్రీః ॥



శ్రీ యోగీశ్వర యాజ్ఞవల్క్య మహాఋషి.

R.1977 [illegible]
[illegible]

శ్రీ గణేశాయనమః

# యాజ్ఞవల్క్య చరిత్రము

## ప్రథమాశ్వాసము

—: అవతారిక :—

శా॥ శ్రీమత్పర్వతకన్యకా కుచయుగ
శ్రీగంధకాశ్మీర చం
ద్రామోదాతి విశాలవక్షుఁడు మహో
ద్యత్ప్రాతకోటాహ్వయ
గ్రామాధీశుఁడు శేషభూషుఁడు దయా
గాంభీర్యుఁ డుద్దండలిం
గామాత్యాగ్రణి కిచ్చుఁగాత సుతపౌ
త్రానేక సౌభాగ్యముల్ । 1

సీ॥ నీటిలోమునిఁగిన నేలమోపరిహితు
నిటలాగ్రమునఁ జక్కనిడిన వాఁడు
బూచుల మెకిమీఁడు పొగరెత్తిమీఁట న
మ్మలతల చెంకి యేమఱనివాఁడు
చిలువలదొరనాచి చెలి జడయందు
చిక్కఁగానిమిడిన చిన్నవాఁడు
సింగము పేరిట చెలువునఁ గొడుకుగ
ల్గినవానిచేఁబూజఁ గొనినవాఁడు

గీ॥ ప్రాంతకోట మహాగ్రామ పట్టభద్రుఁ
డైన శ్రీనాగభూషణుఁడగు హరుండు
మంత్రిమణియైన యుద్దండ మల్లధరుని
లింగయామాత్యునకు శ్రీ లొసంగుగాత ॥ 2

మ॥ గరళంబుద్ధతిగ్రోలి వేలుపులసం
కల్పంబు నీడేర్చి శ్రీ
ధరునేత్రాబ్జము చేత పూజఁగొని కో
దండంబుగా హేమభూ
ధర మెక్కించి పురాసురేశ్వరుల బా
ధల్ మాన్పు గౌరీమనో
హరుఁ డుద్దండకభావతంసుఁడగు లిం
గామాత్యునిం బ్రోవుతన్ ॥ 3

సీ॥ అతను నితంబబింబాలసాలంబిత
కింకిణీసంకులాకీర్ణ రశన
సమదధరాధరచ్ఛాయారుణారుణ
నాసికామౌక్తిక భాసమాన
నైపథ్యశీలతా నానా విధానర్ఘ
రత్నపుంజ ప్రభారమ్యగాత్రి
మహితసుధాసింధు మధ్యమణిద్వీప
నీపకుంజద్రుమనిజ విహార

గీ॥ శ్రీ మహా భూమిభృద్వర శ్రీవిహార
పరమకృపతోడ హరవామభాగనిలయ

పరగు నుద్దండలింగయ ప్రభున కొనగు
పుత్రపౌత్రపరంపరాభ్యుదయ మహిమ ॥ 4

మ॥ అనఘోద్దండకులావతంసుఁడగు లిం
గామాత్యు నాశీర్వచ
స్స్వన దివ్యామృతసూక్తిమీఱ శివునిఁ
వాక్రుచ్చి గంగానదీ
కవదత్తుంగతరంగ ఘుంఘుమిత వా
క్ప్రౌఢిఁ విజృంభించిత
ద్ఘనవంశంబు దిగంతరాళముల ప్ర
ఖ్యాతంబుగా నెన్నఁగన్ ॥ 5

(×) ఇవ్వటి ఉద్యాలు వ్రాసిన ప్రతి శాంతముగా.

—: కథా ప్రారంభము :—

వ. తత్ప్రకారం బెట్టిదనిన అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన యాజ్ఞవల్క్య చరిత్రంబునకుఁ గథా క్రమం బెట్టిదనిన స్నానజపాద్యనుష్ఠానగరిష్ఠులును, పర మోపకారులును, పరమర్మభేదనోపాయధౌరేయులును, శరణాగతవత్సలులును శాంతశమదమగుణ ప్రశస్తులును, సముద్రగాంభీర్యులును, సమధికాభిమాన ప్రచండులును, సకల వేదాంత శాస్త్రతత్త్వనిర్ణయులును, గాయత్రీ మహామంత్రసిద్ధులును, సప్తసంతానాధీశ్వరులును, సత్య భాషాప్రవీణులును, పితృమాతృపూజా విధేయులును, నిరత......దులును, స్వామికార్యహితులును, యేకా దశీవ్రత నిష్ఠాగరిష్ఠులును, ద్వాదశీ బ్రాహ్మణ సమా రాధన తత్పరులును ,సమ స్తరాజాస్థాన పూజ్యులును,

......రస్వ......ప్రజావిచక్షణులును శుక్లయజుర్వేద పారాయణులునైన ప్రథమశాఖాన్వయప్రభుశిఖామణులు నానందకందళిత హృదయారవిందులై యొక్కనాఁడు సూర్యోపరాగపుణ్యకాలమందున సప్తనదీసంగమేశ్వర మందిర ప్రాకారగోపురద్వారంబున సుఖాసీనులై యిష్ట గోష్ఠివినోదంబులం బ్రొద్దుజరపుచుండి స్వశాఖాయుక్తుం డగు మంజుభాషణుండను పౌరాణికుంగనుంగొని యిట్లనిరి.

క॥ మన వంశమునకుఁ గర్తగు
మునివరుఁ డాయాజ్ఞవల్క్య ముఖ్యచరిత్రం
బును క్రమమున విరచింపుము
వినవలతుము సకలలోక విఖ్యాతముగన్ ॥ 7

ఆ॥ వె॥ సకలులైనయట్టి సంయమీవరులలో
యాజ్ఞవల్క్యుఁడను మహామహుండు
ప్రథమపూజ్యుఁ డతనిపై చరిత్రము వినఁ
గౌతుకము మదీయ కర్ణములకు ॥ 8

క॥ తోషణములు దుష్కల్మష
పేషణములు శమనభట విభీషణములుకు ?
ద్భూషణములు......
......యాజ్ఞవల్కి గుణభాషణముల్ ॥ 9

క॥ హారంబులు కీర్తి రమా
హారంబులు మోక్షపదవిహారంబులు స
త్కారంబులు పుణ్యకథా
సారంబులు యాజ్ఞవల్కి సంచారంబుల్ ॥ 10

క॥ పాత్రంబులు నిర్మలకుల
గోత్రంబులు జితదిగంతగోత్రంబులు బల్
చిత్రంబులు దివ్యామృత
సత్రంబులు యాజ్ఞవల్క్య చారిత్రంబుల్ ॥ 11

క॥ కావున నిట్టి కథారస
సేవకు మిక్కిలిమనంబుఁ జెలఁగెడి నో భూ
దేవాగ్రణి మునిచరితము
భావము రంజిల్లఁ దెల్పు పరమప్రీతిన్ ॥ 12

వ. అనిన మహాత్ములారా! మీరడిగిన యాఖ్యానంబు స్కాందపురాణంబున శౌనకాది మహామునులకు సూతుని చేత వక్కాణింపఁబడియె నందు ॥ 13

—: కథాసంగ్రహము సూతుండు శౌనకాదులకు చెప్పుట :—

వ పూర్వంబున శ్రీమన్నారాయణుని నాభికమలంబునందు ......బ్రహ్మరాతి తేజంబున సునంద గర్భంబున పంచవర్షంబు లుండుటయు నంతగర్భస్థుడైన యర్భకునకు వైకుంఠుడువచ్చి బ్రహ్మోపదేశంబు జేయుటయు నంత ......లుండు మాతృగర్భంబున వెడలుటయు, నాతనికి కణ్వమార్కండేయ గౌతమవశిష్ఠాది మహామునులు యాజ్ఞవల్క్యయను నామధేయం బొసంగుటయు, నమ్మహామహా......తజ్జనకుండు చౌలోపనయనాదులు జేయుటయు, వేదాదివిద్యాభ్యాసంబు గావించుటయు సాత్యవతేయుతుండు భూప్రదక్షిణం బరుగుటయు....టియున మాణవకుండు వైశంపాయనునివద్ద చదువుటయు, ...

పాయనునకు బ్రహ్మహత్య సంభవించుటయు, తద్బ్రహ్మ హత్య ......సునందానందనుండు పరిహరించుటయు, తత్ప్రభావంబున కొందరు సహింపకుండుటయు, నతఁడు జనకచక్రవర్తి పురంబునకుం జని మంత్రాక్షత స్పర్శన మాత్రంబున సభాస్తంభంబులఁ బల్లవింపఁజేయుటయు, తద్బ్రహ్మరాతిసుతుండు గురువాక్యోల్లంఘనంబు సేయు టయు, వేదంబు మఱలం గ్రక్కుటయు, తద్వేదం బాప ......బాది పరమపురుషులు బాదరాయణు ననుమతం బున భక్షించుటయు, యిట్లు యాజ్ఞవల్క్యయు గాయిత్రీ మహాదేవి నారాధించుటయు, యాశక్తి సూర్యుని రథ సమీపంబున శుక్ల యజుస్సును వేదంబు నభ్యసించుటయు, నట్లు యాజ్ఞవల్క్యయు క్రమంబున సూర్యుని రథ సమీ పంబుననున్న శుక్లయజుస్సు నభ్యసించుటయు, నతండు గంధర్వుని శాస్త్రవాదంబునం గెలిచి నిజాశ్రమంబునకు వచ్చుటయు, కాత్యాయని యనుదానిని వివాహంబగు టయు, తత్కాలంబున జనకుం డధ్వరంబు సేయుటయు నచ......యమి సభామధ్యంబున అహం బ్రహ్మం బని స్వర్ణధేనువు దానంబు ప్రథమతః అందుటయు నమ్మహా త్ముండు చండాలు......చ్చి పిదప పరిగ్రహించిన నిర్జీవ కాంచన గోగణంబుల నపహరింప జేయుటయు, తత్ప్రకా రంబునకు భంగపడి మహర్షులందఱు నరవిందసంభవు పాలికిఁ జనుటయు, తత్పితామహుండు గార్గెయనుదానిం గలిపించి యాతని పరిభవంబునం బొందించు మనుటయు, నమ్మహాభగవతి యతనితోడం బ్రతిఘటించక కూడి

వర్తించుటయు, నుద్ధాలకుండు కలహించుటయు, శాక
శల్యుండు తత్ప్రసాదంబున సాకల్యంబుగా వర్తింపం జేయ
నేరక పరమారుణమంత్రంబునకు శఘాతంబున ప్రాణంబు
విడుచుటయు మహాఋషుల ప్రార్థనంబున వనితనుమగుడం
బ్రతికించుటయు భారద్వాజశాండిల్య కశ్యపప్రముఖు
లయిన తాపసులు పుత్రభావంబున యాజ్ఞవల్క్యుయు
తామనం ప్రథమశాఖాన్వయో సుగుణులై నడుచుటయు
దీని సవిస్తరంబుగా......చ్చెదనని సభాస్థితులకు మంజు
భాషణుం డిట్లనియె. 14

—: కథా ప్రారంభము :—

సీ॥ హరినాభి కమలంబునందు జన్మించినా
......దృ బ్రహ్మలం దొక్కరుండు
సకల వేదపురాణశాస్త్రాది విద్యలు
నేర్పుగా నేర్చిన నీతిపరుఁడు
సకలబృందారక కాస్థానమానిత బహు
శాస్త్రవర్ణిత వాగ్విచక్షణుండు
గౌతమాత్రివసిష్ఠ కణ్వమార్కండేయ
ముఖ్యసన్మునులకు మొదలివాఁడు
గీ॥ వేదవేదాంతవేదియై వెలయువాఁడు
పాతకాద్రి బలారాతి బ్రహ్మరాతి
నిరతశయా సత్య...వేద...రతి నియతి
[illegible] 15

క॥ ఆతఁడు సునంద యనియెడి
శ్రీతరుణినిఁ బోలినట్టి శీతాంశుముఖిన్
ప్రీతిగ చేకొని విలస
చ్చేతోభవ సౌఖ్యములను జెందుచునున్నన్ ॥ 16

సీ॥ ఆలలితాంగి కపోలస్థలంబులు
తెల్లనై, చన్మొనల్ నల్లనయ్యె
బాలనితంబ బింబములు వెక్కసమయ్యె
భామకు సొమ్ములు భారమయ్యె
కొమ్మకాహారంబు కొద్దిగా మనసయ్యె
మదిరాక్షి కాఁకలి మట్టుబడియె
కాంతకు రుచులపై కాంక్షలు రెట్టించె
మృదులాంగయును మన్ను మెక్కఁదొడఁగె

గీ॥ నడుము నసియాడనాతికి నలసటయ్యె
తోయజాక్షికి మడినిద్ర తోరమయ్యె
పువ్వుబోణికి నెమ్మనుఁ బొదలఁదొడఁగె
మెలఁతలకును గర్భభారంబు మెండుకొనియె ॥ 17

క॥ జడదారి తేజమీగతి
దృఢమయి మఱికరుడుగట్టి దినదినమునకుం
గొడు కభివృద్ధి వహించెను
కడుపున కడుభారమయ్యె కాంతామణికిన్ ॥ 18

సీ॥ ఉవిదపెద్దలకు ప్రత్యుద్ధానములుచేయఁ
దలఁచిదా చెలుల కై దండకొనుచు

నెలఁతయు గృహకృత్యముల సేయువేళల
జవళి స్తంభంబుల చక్కనిలుచు
వనజాక్షి శృంగారవనములఁ గ్రీడింప
నలసియు సుదతుల నలఁగిచూచు
లలన యా సౌధముల్ లలినెక్కఁగమకించి
భామలతో ప్రతిభావలాడు

గీ॥ కాంతరతి కేళికా ప్రసంగములు జేయు
సరసిజాస్యలతో చెలి సరసమాడు
కుటిలకుంతలతగ నలన......ఁడు
పటుతరాత్యంత ఘనగర్భ భారమునను ॥ 19

వ. యిట్లు పంచవర్షంబులు గర్భభార పరాక్రాంతయైయున్న యక్కాంతామణిం గనుంగొని తద్గర్భస్థుండైన యర్భకు నుద్దేశించి జగత్ప్రఖ్యాతిగా బ్రహ్మరాతి యిట్లనియె. 20

క॥ తొమ్మిది ఘడియలు తక్కిన
తొమ్మిది మాసములుగాక తోనై మోసి
ట్లిమ్మగ నిలువగ జెల్లునె
క్రమ్మర భవదివ్య చర్యకాశ్చర్యంబుల్ ॥ 21

ఉ॥ బాలక! "మాతగర్భమున పంచయుగంబులు నిల్వఁజెల్లునే
యీలలితాంగి భారమున యిన్నిదినంబులు తాళునెట్లు నీ
వేలయటున్న" వాఁడ వదియేమివిధం బెఱిఁగింపుమన్న వా
చాలతతోడ నిట్లనియె సంయమివర్యున కర్భకుండొగిన్ ॥

గీ॥ జనక! జనయిత్రి నిజగర్భ సదనమిపుడు
వెడలి చనుదేర నాకది తడవగాదు

విష్ణుమాయా సమీరంబు విసరఁ ననుచు
మున్ను బుధులెన్న భయమంది యున్నవాఁడ ॥ 23

—: జీవునియొక్క వృత్తాంతము :—

వ. కెండియు మహాత్మా! జీవాత్ముఁడు నరకకూపసమయంబైన మాతృగర్భంబు ప్రవేశించి తన్మలమూత్రంబు యాహారంబుగాఁ గొనుచు ప్రవర్ధమాన శరీరుండై యుండి యష్టమమాసంబున జ్ఞానంబు......దమ మున్ను దాను బడిన బాధలం దలచుకొని బహుయోనులయందు అనేక రూపంబుల ప్రభవించితి బహువిధ స్తన్యపానంబు యాహారంబుగా ప్రవర్తించితి ఇదియే పునర్జన్మంబున ప్రాప్తుండనైతి ఇంక నుదయించినప్పుడే దుర్మదంబులైన దుర్బుద్ధులు విసర్జించి కామంబు నిర్ధూమధామంబుగావించి క్రోధంబులు విడనాడి లోభంబు మఱచి మోహంబు విదారించి మదంబు బాఱందోలి మాత్సర్యంములు వర్జించి పంచేంద్రియంబులు గుడియించి, జిహ్వాత్వక్శ్రోత్ర నయనేంద్రియంబులు వి......సార ధర్మంబులును నిస్సారంబుగా ఆచరించి, మనోబుద్ధి అహంకారంబులు మరచి సంసార బుద్బుదకర్మంబులం దాశవిడిచి, దేశాంతరగతుండనై, పరతత్వజ్ఞాన సంపన్నుండనై, మోక్షంబు గైకొనియెద నని యుపలక్షించినంతట :- నవమాసంబున నధోముఖుండై యోనియంత్ర పీడనంబున జనియించి విష్ణుమాయావంశంబున తొల్లి ధైర్యంబునం జెడి క్షుత్పిపాసాపరవశుండై యుండుచు, పూర్వజన్మ కర్మ భారం

బున పుణ్యపాప ఫలంబులు అనుభవించుచుందురు. యిది గర్భోపనిషత్ప్రకారంబు మీకెఱింగించితి ననిన మఱియు యిట్లనియె. 24

క॥ పుట్టువు చావును జనులకు
నెట్టన గల్పించినాఁడు నీరజగర్భుం
డట్టి దురవస్థలంబడు
మట్టు వృథాజన్మమెల్ల మానివరేణ్యా ॥ 25

సీ॥ సకలధర్మ పురాణశాస్త్ర ప్రవీణుండు
పరమ ధర్మజ్ఞాన భాసురుండు
పుణ్యగాయత్రీ ప్రపూత మంత్రజ్ఞుండు
సముచితానుష్ఠాన సత్ప్రియుండు
భూదేవపితృదేవ పూజావిలాసుండు
వైదికానుష్ఠాన వర్ధనుండు
సర్వభూతదయా విచక్షణ స్వాంతుండు
సకలధర్మవిశేష సంగ్రహుండు

గీ॥ తీర్థయాత్రాసముద్యోగ తేజసుండు
సత్యభాషాధురీణుండు సజ్జనుండు
నైన కొడుకొక్కఁడేజాలు సార్యవర్య
యుభయవంశంబులకు కీర్తి యుద్ధరించు ॥ 26

క॥ అందఱి పోలిక నీకును
నందనుఁడై సంభవించి సార్వజ్ఞానా
వందేతరుఁడై యరమితిఁ
జెందంగాఁజాల పూరఁచిర కరములన్ ॥ 27

ఉ॥ ఉండినవాఁడుగాడె శుకయోగిమహోత్తమ శర్మనిష్ఠుఁడు
ద్దండత పెక్కుకాలములు తల్లి నిజోదర మందిరంబునం
దుండియు యా మహాత్ముఁడువరోక్తి త్రిమూర్తులు చింత [గాంచెనా
తండునుబోలె వచ్చెద యథావిధి శ్రీహరి వచ్చునంతటన్॥

వ. అదియునుగాక వర్ణాశ్రమ ధర్మంబులు సంకలితం బులై యున్నయవి యువతి జనంబులు పతివ్రతా ధర్మం బులు దప్పి వర్తించెదరు. వేదంబులు ప్రమాణంబులై యున్నయవి. యిట్లు దురవలోక్యంబైన లోకంబున పుణ్యశ్లోకు లెట్లు మెలంగనేర్తురు. ఇట్టి దుండగంబులు దండింప సమర్థత్వంబు గలుగునట్లుగా నాకు శ్రీమన్నారా యణుండు బ్రహ్మోపదేశంబు జేసినంగాని మాతృగర్భంబు వెడలి రానేరరనిన యతని పలుకులకు వెరగుపడి బ్రహ్మ రాతియు వేగంబున చనిచని. 29

—: బ్రహ్మరాతి వైకుంఠపుర వర్ణన :—

ఉ॥ కాంచన గర్భవంశజుఁడు గాంచె సమన్విత పద్మమందిరా
చంచలలోకనాకచ కుచద్వయ శోభిత పుష్పమాలికా
సంచితవాసనార్భటుల సంగ్రహ శీతలవాత పోతముల్
వంచిత రావనీజ ఫలపాకము దానవవైరి లోకమున్ ॥

వ. మఱియు నవరత్న రచిత కాంచనప్రభా భాసమాన గోపురద్వారబంధుర ప్రాకార విశిష్టంబును, కమలకల్హార కాసానుర భాసుర ప్రసూనమకరంద పానమత్త మధుకర ఝుంకారంబును, కలహంసకాండవ జలకుక్కుట శిఖ

శుకప్రముఖ గసమూహాళల కలావరంబును, నారికేళ శోకపున్నాగకుండ ఖ్జూరాద్యనేక తరునికరవనోపశోభితంబును, లక్ష్మీనారాయణ శ్రీపాదపద్మ శంఖచక్ర చామరాంకుశ రేఖాంకితసికత వామయుస్థళంబును, గౌతమాంగీరస భారద్వాజ వాసిష్ఠ కణ్వ మార్కండేయశుక ప్రముఖముని సంస్తూయమానంబును, ప్రహ్లాదనారద పరాశర పుండరీక వ్యాసాది పరమభాగవత సేవితంబును, గరుడ గంధర్వకిన్నరయక్ష సిద్ధ విద్యాధర పరిచితంబును, నైన వైకుంఠపురంబునంజొచ్చి యప్పుడు. 31

సీ॥ ఉరమున నెలకొన్న యువిదపాలిండ్లపై
కౌస్తుభమణిరుచుల్ గ్రమ్ముకొనగ
కాంచనమయమునై కదుమించు దుప్పటుల్
మేనున నొకవింత మెఱుపుఁజూప
పెక్కడి తారకా? పురమున జేజెల
పెద్ద నమ్రకరుడై ప్రియము గరుప
పద్మాప్తరోహిణీ పతులకు నిరవైన
నేత్రంబులెందు వెన్నెలలుగాయ

గీ॥ పాదతల నిర్మలాంగుష్ఠభాగమునను
సంతతంబున జతవేట సఖియమొప్పు
ప్రేమచింతామణీ భద్రపీఠమునను
చెలఁగి కూర్చున్న శౌరి నీక్షించితపసి॥ 32

క॥ నీరజనేత్రాయ చిదా
కారాయనమః ఖగేంద్రగమనాయ నమో

నారాయణాయ నిస్సం
సారాయ నమో యటంచు చయ్యనబలికెన్॥ 33

సీ॥ కమలామనోహర కౌస్తుభ శ్రీవత్స
పీతాంబరావృతా ప్రియవిహార
వైకుంఠపురవాస వారిజదళనేత్ర
చిద్రూపశ్రీధరా శ్రీనివాస
దామోదరాచ్యుత దానవదర్పఘ్న
నారాయణావ్యయ నారసింహ
వామనశ్రీధర వరదసర్వేశ్వర
వైనతేయతురంగ వాసుదేవ

గీ॥ మ......ఛ కమఠ మృగపమానిరామ
కౌసలేయహావిసుగత కలికిరూప
శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గహస్త
కేశవానంత పరమాత్మ కృష్ణకృష్ణ॥ 34

వ. అవధరింపుము. 35

—: బ్రహ్మరాతి శ్రీమన్నారాయణ సంభాషణ :—

క. దుర్భరమగు మద్భార్యా
గర్భంబున పంచవర్ష కాలము జరగన్
అర్భకుడు వెడలనొల్లక
నిర్భరమున నున్నవాఁడు నిగమాతీతా॥ 36

వ. వెండియు పుండరీకాక్ష, దీనరక్ష, సత్కటాక్ష వీక్ష ణంబునన్ బ్రోవుము, భవదీయ మాయాసమీరంబున పైవిసరిన యజ్ఞానంబు పొడమనో యను భయంబున

వెడలజాలక జననీగర్భంబుననే యున్నవాఁడు, మీ రచ్చ
టికి చనుదెంచి, అతనికి బ్రహ్మజ్ఞానోపదేశంబు సేయ
వలయునని పలికిన, బ్రహ్మరాతి మునిపుంగవుండు విన్న
వించిన యగుఁగాక యని యపుడు. 37

సీ. అమరేంద్రపావక హరి నైఋతివరుణ
మరుదుత్తరేశ శంకరులుఁ గొలువ
చంద్రసూర్య సహస్ర సదృశదీప్తుల శంఖ
చక్రంబు లుభయపార్శ్వములు వెలుఁగ
ప్రహ్లాదనారద ప్రముఖతా శ్రీ మహా
భాగవతోత్తముల్ ప్రస్తుతింప
విజయుఁడు జయుఁడును నేత్రహస్తంబుల
బహుదేవతల బరాబరులుసేయ

గీ. జలజగర్భుండు ఋగ్వేదసామపఠన
మానివర్యులు నుపనిషన్మంత్రములను
కమలయును దాను ఖగపతి స్కంధమెక్కి
కదలె హరి నేగ మునివర్ణ్య సదనమునకు ॥ 38

వ. యిట్లు జగత్ప్రఖ్యాతిగా మురారాతి బ్రహ్మరాతి బుర
స్కరించుకొని భూలోకంబునకుం దిగి పురగిరి సముద్రసరి
త్కాననదేశంబులుం జూచుచు జనిచని ॥ 30

సీ॥ నిండారఁ బండిన నీవారములతోడ
బహువిధ జటిల తాపసులతోడ
సాకిన మృగరాజ శాబకంబులతోడ
సకల ఫలావనీజములతోడ

నిర్మలామృత జల నిర్ఝరంబులతోడ
సముచితసుర మందిరములతోడ
కల్హారపంకజ కాసారములతోడ
కనక ప్రసూనవాసనలతోడ
గీ॥ సరసభూదేవ వేదఘోషములతోడ
మౌని విరచిత యాగ ధూమములతోడ
భాసమానాసమానమై బరగువనము
గాంచి హర్షించె ఖగరాజగమనుఁడపుడు॥ 39

—: శ్రీమన్నారాయణుండు బ్రహ్మరాతి యాశ్రమమున వచ్చుట :—

వ. యిట్లు విలసితంబైన తపోవనమధ్యంబున బ్రహ్మరాతి యాశ్రమంబును జేరం జని యచ్చటా సునందా దేవి యానందింప యప్పతివ్రతారత్నంబువలన ప్రత్యుద్ధానాభి వందన ప్రియభాషణంబులు మొదలయిన యతిధి సత్కారంబుల పరితుష్టుండై తద్గర్భస్తుండైన యర్భకునకు పర బ్రహ్మజ్ఞాన మంత్రోపదేశంబుజేసి బ్రహ్మరాతి చాత ననుజ్ఞాతుండై యవ్వనజాక్షుండు నిజనివాసంబునకుం జనియె. 40

వ. నంతట.

చ॥ పొలఁతి ప్రసూతి వేదనల బొందగజొచ్చె నతిత్వరస్థితిఁ
ఫలితము లయ్యెనొప్పె నిలభాస్కరబింబము తూర్పు దిక్కనం [నందనుం
దొలి నుదయించు కాలమున తొయ్యలికిం బ్రభవించె
డలవను దేవుభామినికి యచ్యుతుఁడుఁ జనియించుపోలికన్॥

—: శిశువు జననము :—

సీ॥ వారివాహంబులు వలనొప్ప వర్షించె
కుసుమవర్షంబులు గురిసెమింట
దేవదుందుభులు ప్రదీప్తంబులై మ్రోసె
హోసగ యజ్ఞాగ్నులు హొందఁదొణగె
వాహినుల్ నిర్మలవారి పూరములయ్యె
సకలభూతంబులు సంభ్రమించె
దుర్భిక్షభయములు దూరదేశముఁ జేరె
ధర్మంబు నాల్గుపాదముల నడిచె
గీ॥ ప్రకృతిగనుపట్టె చోరుల భయములణచె
కృతయుగాంత ప్రవర్తన గేలిగొనియె
బ్రహ్మరాతినిజాంశ ప్రభావమునను
బాలకుండుదయించిన కాలమునను ॥ 43

వ. వెండియు నతండు గాయత్రీసంపన్నుండును, సూర్యోపాసకుండును, శుక్లయజుర్వేద పారాయణుండును, విజ్ఞానేశ్వర శాస్త్రవ్యాఖ్యానకరుండును, భూతభవిష్యద్వర్తమానవ్యవహారుండును, ప్రథమశాఖా వంశోద్ధారకుండును, నగునని యాకాశవాణియుఁ ఘోషించె నప్పుడు. 44

ఆ॥ వె॥ పురుఁడుబుచ్చి మఱియుఁ బుణ్యాహవాచన
మాచరించి బాంధవానుమతిని
గురుజనములు నామకరణంబుఁజేసిరి
యాజ్ఞవల్క్యయనఁగ నర్భకునకు ॥ 45

క॥ పంచవర్షాగమమును
సంచిత చౌలోపనయన సత్క్రియలను గా
వించి జనకుండు సుతు జది
వించగ వలికెననుచు కడువివేక స్ఫురణన్ ॥ 46

వ. తదనంతరంబు బ్రహ్మారాతియు స్నానసంధ్యాద్యనుష్ఠా
నంబులుదీర్చి శుచి ప్రదేశంబునఁ గూర్చుండి శ్రీహరి
దాసుండును బహుదహనగిరిగుహావిహారుండును మోపరప
వాసుండును కృష్ణాంజనకమండలధరుండును నిగమా
ఖ్యాసుండును కాశీనివాసుండును నైన వృద్ధవేదవ్యాసు
నిట్లని స్తుతియించె. 47

సీ॥ మదినీ పదునెనిమిది పురాణములకు
కర్తయై యెవ్వాఁడు ఘనతకెక్కె
భారతంబనియెడి భాసురామృతమును
నయములో......
సోమకాసురునిచే సూత్రముల్ దప్పిన
వేదంబులెవ్వాఁడు వెదకిగూర్చె
కూర్మితోడ వసిష్ఠు కొడుకు నందనునకుఁ
బుత్రుఁడై యెవ్వాఁడు భూతికెక్కె
గీ॥ భాగవతము పరీక్షు నృపాలునకును
జెప్పి వైకుంఠపదమునఁ జేర్చినట్టి
శుకునకెవ్వాఁడు తండ్రియై సొబగుమీరె
నట్టి వ్యాసార్యునకు వందనం బొనర్తు ॥ 48

గీ॥ నాల్గు తలలులేని నళినగర్భుండన
బాహుయుగముగలుగు బలిహరుఁడన
ఫాలదృశము లేని శూలియన వెలుంగు
వ్యాసునకునొనర్తు వందనములు ॥ 49

వ. అని యిట్లు స్తుతియించి యాకరమణ మంత్రోచ్చార
ణంబు జేసిన. 50

సీ॥ ప్రావృట్పయోధరపటలంబు కైవడి
మెఱుగారు నల్లని మేనువాఁడు
చండదీధితి కర సాదృశ్యమునుఁజెందు
జాంబూనదాభ వాండంబువాఁడు।
చిగురాకు జొంపంబు చెలువునఁగనుపట్టు
పాటలపట జటాభరమువాఁడు
కటికచీకటుల నుక్కణగించువర కృష్ణ
మృగచర్మవసనంబు మెఱయువాఁడు

గీ॥ పదజటాంత క్రమంబుగా ప్రౌఢిమీఱ
ఋగ్యజుస్సామ పఠనచే యోగ్యులైన
శిష్యులును తాను విజయంబు జేసెఁ బాద
రాయణమునీంద్రుఁడా బ్రహ్మరాతికడకు ॥ 51

—: వ్యాసుని సన్మానించుట :—

వ. యిట్లు వచ్చిన మునీంద్రునకు నతిధి సత్కార్యంబు
లాచరించి మహాత్మా! నీవు బ్రహ్మజ్ఞానపరుండవు, నీప్రభా

పాకశాసనప్రముఖ సకలదేవతాగణంబులు నిన్నెఱుంగు
దురు, సమస్తలోకంబులు నీయాధీనంబులు, వేదవేదాంత
శాస్త్రపురాణేతిహాసంబులు నీవలనం బుట్టిన యది, నీ
యందు ధర్మార్థకామమోక్షంబులు సంభవించుగావున,
మీ వలన యొక్క కార్యంబు సఫలంబు జేసుకొనవలసి
యున్నది, యని ముఖోల్లాసంబున బ్రహ్మరాతి వ్యాస
మునీంద్రున కిట్లనిరె. 52

సీ॥ పరమపుణ్యులు సత్యభాషాప్రవీణులు
వేదాంతశాస్త్రకోవిదులు గుణులు
సంతతాచారులు సద్ధర్మశీలురు
శ్రీహరిపాద సంసేవకులును
బహుపురాణ ధ్యానుభవులు సుస్వాంతులు
శాంతులు కరుణాప్రసన్నహృదయు
లానంద పరిపూరితాంతరంగులు సర్వ
సములును సుజ్ఞానసంయుతులును

గీ॥ గర్వదూరులు పరమోపకారులాశ్రి
తావళికి కల్పభూజముల్ దేవసములు
నైనవారలె యాచార్యు లట్టివారి
కడను జదువగవలె శిష్యగణములనఘ ! । 53

క॥ క్షితినంతవారు మీరలు
ప్రతియునులేనట్టి వేదపారీణులు మ
త్సుతునియెడల జదివింపుడు
ఖిలరణ గుణశీల వేదవేదాంతంబుల్ । 54

గీ॥ పరఁగ పతికిని సౌందర్యవతియుగాని
యతివ, ధరలోన వ్యభిచారిణియైన జనని
చదువు నేర్పని తండ్రియు సంభవునకు
మొదలి శత్రువులని శ్రుతుల్ మ్రోయుచుండు ॥ 55

వ. కావున యేను పుత్రునిం జదివింపవలయు, నమ్మాణవక
శ్రేష్ఠునిమీఁద నాచిత్తంబు కరుణాయత్తంబై యున్నయది
మీరు నట్లుగాఁగ యనుగ్రహించి యతనికి సారస్వత
విద్యాదానంబు సేయవలయునని పలికిన నతండు వల్లె
యని బాదరాయణుండు ప్రమోదంబున బ్రహ్మరాశి
సుతునకు సర్వగ్రహంబు లేకాదశస్థానంబుననున్న సుదినం
బున నక్షరస్వీకారంబు సేయించి పదక్రమజటావర్ణ
యుక్తంబుగా ఋగ్వేదంబు చదివించి భాట్టప్రభాకరమీ
మాంస తర్క వ్యాకరణ నాటకాలంకారంబులఁ దెలిపి,
యాథర్వణమంత్రంబు లుపదేశించి, యతనిం దన యాశ్ర
మంబునకు తోడ్కొనిచని యక్కడ. 56

క॥ ధీయుక్తుండగు వైశం
పాయన మునివద్ద నిలిపి పలికెను మిగులం
యీయాజ్ఞవల్క్య యజురా
మ్నాయము జదువంగఁ జేయు నయముఁ జెలంగన్ ॥ 57

వ. అని యిట్లుపలికిన వైశంపాయనుఁడు వ్యాసానుమతంబున
యాజ్ఞవల్క్యుం గూర్చుకొని సహస్రసంఖ్యలగు శిష్యులకు
విద్యాభ్యాసంబు సేయించుచున్న సమయంబున. 58

—: వైశంపాయనునకు బ్రహ్మహత్య కలుగుట :—

సీ॥ తద్భాగినేయుఁ డుత్తముఁడు బాల్యంబున
స్వాధ్యాయ మెఫుడును జదువుకొనుచుఁ
గ్రమముదప్పంగ పఠాకించపఁ గోపారు
ణాక్షుఁడై హుంకార మాచరించి
సక్రోధుఁడగుచు వైశంపాయనుం డల్గి
తన పాదతలమునఁ దన్నుటయును
కులిశ ధారాహతిఁ గూలినధారణీ
ధర శిఖరముఁబోలె తల్లడిల్లె

గీ॥ భూమిమీదఁద్రెళ్లి పొలపోయి ముఖకాంతి
వేడికొన శరీర వివశుడగుచు
ప్రాణములు చలింప పంచత్వమొందెను
బ్రహ్మరాతిముఖులు భయముపడఁగ ॥ 59

వ॰ యిత్తెఱంగున బ్రాహ్మణుండు జచ్చిన పృధివ్యాపస్తేజో వాయ్వాకాశంబులు క్రోశంబుగాసేర్చి, మునిబృందంబులెల్ల నతని బహుప్రకారంబుల నిందించిరి, శిష్యగణంబులు డెందంబుల ప్రాణభయంబులు యధాయధరులై పరువులెత్తి రా సమయంబున. 60

సీ॥ కణతల వెలిగ్రుడ్లు కటికిపెన్నుదునుట
రక్తోర్థ్వపుండ్ర మీరజము నెఱప
నిరసించు వేట్కతో నిగనిగమించొక్క
నీర్కావిధోవతి నివ్వటిల్ల

ఉత్తమాంగంబున నూర్ధ్వకేశంబులు
రాగివర్ణముల రహినహింప
పాతాళమందిన పాదునూతులనంగ
నక్షులు పెడతల నాశ్రయింప
గీ॥ దప్పియాకలి దట్టమైతగ వహింప
బక్కబక్కని మేన్వడపడవ డంక
వ్యాసమౌని వాక్యవశత వైశంపాయ
నాఖ్యునెదుట బ్రహ్మహత్య నిలిచె॥ 61

క॥ యీరీతి మహోదారుణ
కారణమున బ్రహ్మహత్య గదిసిన యపుడే
పాఱుఁడు మిక్కిలి భయపడి
ధీరత దెలియంగఁగనుచు దిట్టముగాఁగన్॥ 62

క॥ ఘనతరుఁడగు తద్బ్రాహ్మణ
దనుజ నివారించుశక్తి దన కొదవమియుం
దన శిష్యసమూహంబులఁ
బనిపడి యందరినిఁబిలువ బనిచి ట్లనియెన్॥ 63

ఉ॥ ఓయి!మహాత్ములారా!సుగుణోజ్జ్వలులార!కృతార్థులార! నే
జేయఁగరాని కృత్యమును జేసితి భూతములెల్లసాక్షిగా
వేయును జెప్పనేమిటికి విప్రపిశాచముఁ బాఱద్రోలి నా
కీ యపకీర్తిబాపు ఘనుఁడెవ్వఁడు మీసభలోనగల్గడే।
గీ॥ మొదలు కోపంబు కడుపాపమునకుఁ బొత్తు
పాపమున సంభవించును బ్రహ్మహత్య

యనుచు భూలోకమున మర్త్యులాడుకొనిన
బల్కులన్నియు నాయందు బద్ధమయ్యె। 65

సీ॥ జంభాసురారాతి గంభీరశంభోప
మానదంష్ట్రాకరాళాసనంబు
గాత్రాతి భీకరాకాంతి పరాభూత
గరళకంధరకంఠకాళిమబ్బు
నిరుపమాంగాద క్వన్నిస్యాతకారణ
ఉళితదారుణ కరాలోకనంబు
తామ్రోరుసూచికాదారుణ తరమస్త
ఫలితోర్ధ్వ కేశప్రవర్ధనంబు

గీ॥ నీలనీరద సంఘాతనినద గర్జ
తాట్టహాసంబు త్రిజగద్భయంకరంబు
పటుకఠోరంబులైన యీ బ్రహ్మహత్య
పరిహరింపుఁడు యిపుడు మీ ప్రౌఢిమమున ॥ 66

—: యాజ్ఞవల్క్య మహాఋషి బ్రహ్మహత్య నివారించుట :—

వ. అనిన వారు తద్బ్రహ్మహత్య పరిహరింప సమర్థులుగాక యూరకుండిన ప్రాజ్ఞుండైన యాజ్ఞవల్క్యయు మేఘగంభీర భాషణంబుల నిట్లనియె. 67

క॥ స్వామీ వైశంపాయన!
నీమనమున చింతయేల నే నిటుగలుగన్
నామంత్ర ఖడ్గధారలు
భూభూసుర దనుజవిభుని పొగరణగింతున్। 68

వ. అనిన యాజ్ఞవల్క్యు తనకు వ్యాసుం డుపదేశించిన సకల భూతోచ్చాటనంబులయిన యథర్వణమంత్రంబు లుచ్చరించిన, యవి ఖడ్గంబులై శస్త్రంబులై శూలంబులై యా బ్రహ్మహత్య భూతంబునుం దాకిన యది ఖర్షరితాంగంబై నిర్వహింపనోపక పలుదెరంగులుం బరచె నపుడు, 69

క॥ ఆతని మహిమను నోర్వక
చేతోవిధులను నొవ్వఁజేసెను శిష్య
వ్రాతంచిత రజనంబుల
కేతెరగున మేలునోర్వ నెవ్వరు జగతిన్ ॥ 70

గీ॥ తనకు మేలుజేసెనని విశ్వసించి నా
వాఁడుగాక యాజ్ఞవల్క్యుమీఁద
కరుణ దొరసియుండె ఖలుఁడు వైశంపాయ
నాఖ్యమౌని యిటుల నడువఁదగునె ॥ 71

—: యాజ్ఞవల్క్యు వల్ల మంత్రాక్షతలు జనకునకు పంపుట :—

వ. యిట్లు బ్రహ్మహత్యదూరంబైన వైశంపాయనుం డందరి కన్నా, మహాత్మ్యంబున నతిశయుండని యాజ్ఞవల్క్యుమీఁద యీర్ష్యయంబున తన శిష్యులనందఱిం బిలచి మీరు దినదిన మొక్కఁడొక్కఁడు మిథిలాపట్టణంబున కరిగి, వామపాదంబు అంగారంబులయందును, దక్షిణపాదంబు వలయపంతంబున నునిచి సుకరంబుగా పుణ్యపాపంబు తేర్పరచి రాజ్యంబు సేయుచున్న, జనకచక్రవర్తినిఁ బొడగని యాశీర్వాదంబు జేసి మంత్రాక్షత లొసంగి

రావలయు నతని రాజ్యంబున దుష్టమృగ బాధలు పరిహృతంబులై రాక్షసభయంబుల దప్పి, కందమూల ఫలశలాటు భరితంబులైన వనంబులనున్నవార మనిన మహాప్రసాదంబని వారలాప్రకారంబుల ప్రవర్తింపుచుండిరంత.

క॥ తనవంతు దినము వచ్చిన
మునివర్యుఁడు యాజ్ఞవల్క్య ముదమొప్పగ తా
జనకుని పట్టణమునకును
చనిచని తద్వీక్షణాతి సంభ్రమపరుడై ॥ 73

వ. యిట్లు చనునప్పుడు. 74

—: జనకుని రాజ్యము వర్ణన :—

గీ॥ శాల్యతిలయవ గోధూమ చణకరమ్య
వివిధ ధాన్యంబువల విర్రవీగి పండి
పొదలి ధాన్యంబుపోకకు పుట్టెడమ్మ
కరవుకాలము లెఱుగ రద్ధరణిజనులు ॥ 75

క॥ కురియు నెల మూడువానలు
ధరమీదను రాలి పంటధాన్యము లెల్లన్
మరలగ మొలచి దినంబును
పఱుపడి దున్నకనె పండు బహుసస్యంబుల్ ॥ 76

క॥ పని గలిగినపుడె మింటను
జనకునకును జనించి కురియు చెఱకురసంబుల్
తనియగ బహు దుగ్ధంబులు
దినమును చెన్నలరి బితుకు ధేనువులెల్లన్ ॥ 77

సీ॥ కర్ణంబులను రత్నకలితంబులై పుట్టు
కనకకుండలములు గదలియాడ
మెఱుఁగులు జెంద నెమ్మేనులజాళువా
పట్టుపచ్చడములు పరిడలింపు
వలికె నికార్శ్యవిధోవతులు వింజలుమీార
బంగారు మేల్ కట్లు రంగుమీార
కోమలతరకరాంగుళిములు జాంబున
దాంగుళియ్యకమ్ములు తొంగలింపు
గీ॥ సకల సౌభాగ్యములుగలిగి సౌధమునను
ధాన్యములు పెక్కుధనములు తడబడంగ
విప్రవీగుదురా మహోర్వీతలమున
నగ్రహారంబులందు మహాజనములు ॥ 78

మహాస్రగ్ధర ॥
దొరగున్ పూదేనెకాల్వల్ తొలితొలిమిరులన్
తోయముల్ వేడ్కమించున్
పరిపూర్ణాబ్జోత్పలాది ప్రమద కరములై
పారు పుణ్యంపు టేరుల్
పరికింపంచిత్రపుష్పా పరిమితఫలం
సంపత్తినందున్ వనంబుల్
అరయంగా కేళికాగ్రహముల యువజనం
బాత్మమోదంబు నొందున్. 79

సీ॥ ఆమడామడ మృదులాన్నసత్రంబులు
వెలయుచేరువ చలివిందరులును

సిరులు చిందులు ద్రాక్ష శృంగారవనములు
కాంచన దేవతాగారములును
పొగడిక గనుదొడ్డ పుణ్యస్థలంబులు
నధికంబులైన పుణ్యాశ్రమములు
విప్రమార్గమ్ముల వేదఘోషంబులు
పరమహంసలశాస్త్ర భాషణములు

గీ॥ విభవములు దనర్చు శుభశోభనంబులు
భూమిసురుల భూరి భోజనముల
సంతతంబుగ గలిగి సకలభాగ్యంబులు
విపుల యభినవాభి వృద్ధిబొందు ॥ 80

క॥ హోమంబులు గావింతురు
ధూమంబులు వెల్లునెగసి తుద చదలంటన్
గ్రామ గ్రామంబులకడు
భూమీసురు లపుడు దమ ప్రభుత్వము లెసగన్ ॥ 81

వ. యిట్టి సకలధర్మంబులు గలిగిన ధరణీతలంబు గనుంగొని మనంబున ప్రమోదంబునొంచి యాజ్ఞవల్క్య మహాముని వల్లభుండు(గ)వెండియు చని చని. 82

సీ॥ భర్మమయోన్నత ప్రాకారములతోడ
రజితకాంచన గోపురములతోడ
వసుధామరక్షత వైశ్య శూద్రులతోడ
గంధేభగణ చతురంగములతోడ

విటనటగాయక విద్యాధికులతోడ
పణ్యపుణ్యాంగనా ప్రతితితోడ
లవణాదివివిధ మద్రసవస్తువులతోడ
కలమాదిధాన్య ప్రకరములతోడ

గీ॥ పువ్వుతోఁటలతోడ సంపూర్ణకుముద
కమలకాసారములతోడ ఘనత కెక్కి
యేపుమీరిన శ్రీ మిథిలాపురంబు
కాంచి యత్యంత సంభ్రమక్రాంతుఁడగుచు॥ 83

ఉ॥ ఆ పురిసొచ్చి సంతతము నద్భుతమున్నట్టి చెట్టుమట్టునా
తాపసవల్లభుండు కలధౌత హిరణ్మయ రత్నవీధికా
స్థాపిత నూత్న రత్నరుచిజాలసమంచిత సర్వదిక్తమో
దీపితమైన యీ నృపుని దివ్యసభాంకము జేరి యచ్చటన్ ।

—: యాజ్ఞవల్క్య మంత్రాక్షతలు సభాసదనంబునఁ జల్లుట :—

వ. యిట్లు చని జనకుండు సభాసదనంబున లేక యంతఃపురం బునకుం వేంచేసియుండిన యాజ్ఞవల్క్యమునిపుంగవుం డభిమానప్రచండుండుగావున యతండు వచ్చునంతాక తనకు నిల్వకారణంబేమి యని యక్కొల్వుకూటంబున నిఖలవేదోక్తంబులైన మంత్రాక్షతంబులు జల్లి యుల్లాసంబునం జనియె. 85

వ. నయ్యాజ్ఞవల్క్య యాశీర్వాదంబున తత్సభాస్తంభంబులు గంభీరకుశపల్లవ కుసుమకలాటు ఫలభరితంబులై కల్ప మహీజంబుల దేజరిల్లె నప్పుడు. 86

—: జనకుండు వైశంపాయనునివద్దకు యాజ్ఞవల్క్యుచేత ప్రతిదినంబు మంత్రాక్షతలు పంపుమని దూతనంపుట :—

క॥ ఆవిధమంతయుఁ గనుఁగొని
భావంబున వలరి పుడమిపతి విస్మితుఁడై
యా వైశంపాయనముని
సేవకును కలిప్పనంపె క్రియదళుకొత్తన్ ॥ 87

క॥ పనిచిన యా విప్రోత్తము
డనురాగముతోడ మానియాశ్రమమునకుఁ
జని యచ్చట మహిమంబులు
గని వినుతించుచు ప్రమోద వివశాత్మకుఁడై ॥ 88

సీ. గాలవ జాబాలి కణ్వాదులకు నెల్ల
నిరతంబు నిగమముల్ నేర్పువాని
పంచేంద్రియంబులు పటుశక్తి బంధించి
యోగనిద్రావస్థ నుండువాని
మహిత నారాయణమంత్ర సముచ్చార
ణానురాగంబున నలరువాని
మొదటివేల్పు చతుర్థమూర్తి నొక్కని దక్క
నొండు దైవము నొల్లకుండువాని

గీ. బాదరాయణునకుఁ బరికింప ప్రియశిష్యుఁ
డైనవాని ప్రేమ నణచువాని
అనఘుఁడైనవాని ఘనునివైశంపాయ
నాఖ్యుఁగని ప్రణామమాచరించి ॥ 89

క. దేవా! వైశంపాయన
భూవల్లభుఁ డిటకు నన్నుఁ బుత్తెంచె మహా
దైవజ్ఞు లగుట మీకును
సేవకుఁడాతండు కరుణఁ జేకొనుఁ డతనిన్ ॥ 90

సీ. శిష్యుఁడొక్కఁడు నిన్న......నచ్చోటికి
చనుదెంచి పతిలేని సభనుగాంచి
మంత్రాక్షతలు జల్లి మరలంగబోయిన
తద్విశేషమున నాధరణి విభుని
కొలువుకూటంబులో గురుతల స్తంభంబు
లన్నియు కల్పవృక్షాకృతియును
పత్ర పుష్ప సమస్త ఫలభరితంబులై
విస్మయాస్పదములై విర్రవీగె
గీ॥ వింతలంతయు కాంచి నవ్విభుఁడు మున్ను
వచ్చి పండిన సద్బ్రహ్మ వంశభవుఁడు
దినదినంబును నట చనుదేరవలయు
విన్నవింపఁగ మనిరె నవ్విభుఁడు మీకు ॥ 91

క॥ ఆతఁడు మహానుభావుఁడు
ధాత్రి ముఖోద్భవుఁడు మిగుల ధన్యుండగుటన్
యేతెంచిన మద్గృహమతి
పూతత్వము నందుననుచు భూపతియాలరున్ ॥ 92

వ. అని భూసురేంద్రుఁడు తమ రాజేంద్రుండు తనకు నావ
తిచ్చిన ప్రకారంబు లన్నియు విశదంబుగా విన్నవించిన
నట్లయగుంగాక యని వైశంపాయనుండు యాజ్ఞవల్క్య

నాకర్ణించి, మహాత్మా ! నీవు ప్రతిదినంబును యా జనకు నకు మంత్రాక్షతంబు లొసంగి రావలయు, దేశంబులు నేలేట నృపుల యాజ్ఞాక్రమంబు లుల్లంఘింప యతి దుర్ల భంబులనిన యతం డిట్లనియె. 93

—: యాజ్ఞవల్క్య ధిక్కరించి విద్య గ్రక్కుట :—

క॥ మునుపు దినమొక్క రొక్కని
జనకుని కడ కేగుమనుచు సమకట్టితివే
యనుచిత మాడఁగ జెల్లునె
చనునే మీకిట్టి బహు మృషాభాషణముల్ ॥ 94

సీ॥ స్నానజపా ద్యనుష్ఠానముల్ దొలగించి
వేదాదివిద్యలు వీటబుచ్చి
నిరతయోగాభ్యాస నిష్ఠ లుల్లంఘించి
దేవపూజలయందు దృష్టిమఱచి
అగ్నిహోత్ర క్రియాలాచరించుట మాని
అతిథి సంతర్పణంబపనయించి
సూర్యనమస్కార శుద్ధమార్గమణంచి
నిర్మలజ్ఞానంబు నీటగలిపి

గీ॥ నాకు నేమిటికై నరక హేతువు లయిన
రాజసేవ కేను రమణనరుగ
ననిన మౌనివర్యుఁ డత్యంత కుపితుఁడై
యాజ్ఞవల్క్య కనియె నాగ్రహమున ॥ 95

క॥ తనవద్దన యామ్నాయము
నసయంబును జదివి మత్సఖాలాపములన్
వినసైతివి మావిద్యలు
నెనయగ మాకిపుడు మరలనిమ్ము కృతఘ్నా ॥ 96

వ. అని మహోత్కటంబైన కోపంబు నకటంబులదర హుంకారంబుచేసి యహంకారంబున యాజ్ఞవల్క్య మంత్రోదకంబులు పుచ్చుకొని వైశంపాయనువద్ద చదివిన యజుర్వేదంబు మరలంగ్రక్కిన యామ్నాయ విద్యానలంబు సముద్రమథనావసరంబునం బొడమిన కాలకూట విషానలంబు చందంబున భుగభుగాయమానంబై పెనుమంటలు పొగలుగ నభంబు సముద్రమథనావసరంబునం బొడమి ......సకలజగంబుల దహింపం దొడంగిన, 97

క. జనకుని పనిగొనిన మహా
జనవర్యుం డదరి తత్ప్రచారంబులు త
జ్జననాథున కెఱిగించిన
విని యాశ్చర్యంబునొంది వినుతించెతగన్ ॥ 98

వ. యిట్లు వేదంబులు ప్రజ్వలింపుచున్న సమయంబున, సకల వేదాంత విద్యాశీలానుండయిన వ్యాసుండు, భూప్రదక్షిణం బాచరించి, యనేక విప్రజనశిష్య సహితుండై యచటికి చనుదెంచి వైశంపాయనునిచేత నభినందితుండై తదుపద్రవంబు వీక్షించి, ఆపస్తంభబోధాయనాది మహర్షుల నాకర్షించి యందు వానలంబు పరిగ్రహింపు డనిన, వారును బాదరాయణానుమతంబున చకోర

విహంగంబులై పీతిహోత్రస్వరూపంబున వెలుగుచున్న యాయజుర్వేదంబు భక్షించిరని శౌనకాది మహామును లకు సూతుండు వక్కాణించిన తెఱంగున తత్సభికులు హే మహాత్మా! అటమీఁద వృత్తాంతంబెట్టులయ్యెనని యడిగిన.

శా. దక్షారాతి పదారవింద మకరందాస్వాద సేందిందిరా
నక్షత్రేశకళావిశారద నిజామ్నాయ ప్రభావజ్ఞసా
దక్షాదక్ష కటాక్షవీక్షణయనంతాత్యంత వాగ్గుంభనా
సాక్షాద్దీనజనానుపాలన మహా సౌభాగ్య తేజోనిధీ ॥ 100

క. సర్వగణిత తంజ్ఞను
పర్వణ సంభాంతరాళ పణితసమజ్ఞా
నిర్మాణ విమలమానస
గర్వ సముద్భితవిపక్ష గజపంచాస్యా ॥ 101

మాలిని. సమదరిపువలియుగా శాశ్వతైశ్వర్యభోగా
సుమహితబహుపుణ్యా శుద్ధవిద్యానుగణ్యా
హిమకరసమకీర్తీ యీశ్వరధ్యానవర్తీ
కుముదనివహదానా గుప్తదానావధానా ॥ 102

ఇతి శ్రీమద్భ్రమరాంబికావరప్రసాదలబ్ధ కవితాధురంధర పూర్వకవిప్రయోగ శబ్దానుబంధబంధురసరస కవిమిత్ర యల్లనామాత్యపుత్ర సకల సద్గుణవిధేయ ఘట్టుప్రభునామ ధేయ ప్రణీతంబైన యాజ్ఞవల్క్య చరిత్రంబను మహాకథ యందు ప్రథమాశ్వాసము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

॥ శ్రీః ॥

శ్రీః

శ్రీ గణేశాయనమః.

# యాజ్ఞవల్క్య చరిత్రము

## ద్వితీయాశ్వాసము

---

శ్రీకాంత భక్త వత్సల
రాకేందు[illegible] సమాన కీర్తి ర[illegible] [illegible]
సా[illegible] [illegible] దాసను
[illegible] నాంతర [illegible] [illegible] 1

క॥ ...హారహీర [illegible] శ్రీకర [illegible] [illegible]
పార సితాంభోజచంద్ర చందనశర మం
దారసిభ శుభకీర్తి వి
హారా! యుద్దండ లింగ మూమాత్యమణీ ॥ 2

వ. అవధరింపుము శౌనకాదిమునీంద్రులకు సూతుండు పరమ హర్ష సమేతుండై బల్కిన వారలు విని యో మహాత్మా యటమీాద వృత్తాంతంబు వినవలతుము మా కెఱింగింపు మనిన నతం డిట్లనియె. 3

—: యాజ్ఞవల్క్య గాయిత్రి నారాధించుట :—

గీ॥ యాజ్ఞవల్క్యమౌని యాజుషామ్నాయంబుఁ
గ్రక్కి సత్వరమున యుక్కుమిగిలి
యధిక భక్తియుక్తుఁడగుచు గాయిత్రి నా
రాధనంబుజేసి ప్రాజ్ఞుఁడగుచు ॥ 4

వ. అవధరింపుము శ్రీ వైశంపాయను నెదుటం గ్రక్కిన
యాజ్ఞవల్క్యుండు చనుదెంచి దివ్యనదీస్నానం బాచరించి,
శ్రీ మన్మహాగాయత్రీ మంత్రోచ్చారణంబుచేసిన తత్క్ష
ణంబ త్రిమూర్త్యాత్మకంబై విశ్వంబై విశ్వప్రకాశంబై
విశ్వ వేద్యంబై, విశ్వరూపంబై యట్లు సాక్షాత్కరించిన
యమ్మహామంత్రదేవతా కృపావలోకనంబునకు నానంద
బాష్పంబులు నేత్రారవిందంబులు వర్షింపం గనుంగొని
ప్రదక్షిణ నమస్కారంబులు సలిపి యిట్లని స్తుతియించి. 5

శా॥ పాత్రుండైన విభుండు నిశ్చలపరబ్రహ్మంబు బల్వేదము
ద్గోత్రారాతి విభాకరాదిబుధ సందోహంబులన్ శక్తిక
న్యాతి వ్యాస మహర్షిపుంగవుల నెన్నన్ సాటియేనీకు గా
యత్రీ! నిన్ను పఠించువారలకు సాధ్యంబుల్గదే మోక్షముల్॥

గీ॥ పద్మగర్భవిష్ణు భర్గాది దివిజులు
సంభవించిరాత్మ జఠరమునకు
బ్రహ్మ కర్మమునకు ప్రథమకారణమున
మంత్రరాజ మఖిల మంత్రజనని ॥ 7

శా॥ విందుల్ వీనులకున్ భవన్మహిమముల్ విఖ్యాతభూదేవతా
సందోహార్ఘ్య విశేషతోయములు నీసన్మంత్రయుక్తంబులై
మందేహాది సమస్తదైత్యవిభులన్ మర్దించి రక్షించి బెం
పొందన్ సూర్యప్రభాతకాలమున గాయత్రీ మహాదేవతా॥

క॥ ఉదయంబున నాదిత్యున్
బొదివిన మందేహదైత్య పుంజంబులచే

బ్రదుకున లేకున్న భవ
త్పదమల మంత్రార్థతోయ శస్త్రాస్త్రంబుల్ ॥ 9

సీ॥ నిన్నుంచి సంధ్యాధి నిత్యకృత్యంబులు
బ్రహ్మాకరము లీరు పడగగలిగె
నిన్నుంచి పెక్కతా నిగమముల్ ప్రభలించి
సకల కరణంబులు సరణిగలిగె
నిన్నుంచి బ్రహ్మాది నిర్జరవరులకు
ధాతృడీశ్వరుఁడన ధాత్రిగలిగె
రమణనోంకార దివ్యాక్షరంబునకును
నిన్నుంచి నిలువంగ నీడగలిగె

గీ॥ సరగగాయిత్రి నీప్రభావంబు దెలియ
జాల నెవ్వరు జనని యీజగతిలోన
..........................
.......................... 10

గీ॥ తల్లికన్న మిగుల దైవంబు శ్రీహరి
పాదభక్తికన్న వ్రతము సంత
తాన్నదాన తుల్యదానంబు సేయ గా
యిత్రికన్న మంత్ర మిగులగలదె ॥ 11

వ. కావున జగజ్జననీ సకలమంత్రాధి దేవతవైన నిన్ను ప్రార్థించెద. వైశంపాయనునివద్ద చదివిన యామ్నాయం బులు వివాదంబున క్రమ్మర వెడలించితి, తదాచార్యునకు ముఖ్యస్తంబులుగా నివేదంబులు నాకు ప్రసాదింపు మను టయు, అన్నిగమమాత నిట్లనియె. 12

క. నీ మృదువచనంబులకును
నామానస మింతయలరి నయమైనది యిం
కేమైన యడుగు మిచ్చెద
భూమీసురవర్య సకలభూతము లెఱుఁగన్ ॥ 13

—: గాయత్రీ స్తోత్రము :—

సీ॥ పుట్టక యటమున్న పురుషోత్తముఁడు వచ్చి
బ్రహ్మోపదేశ మేర్పడఁగఁ జేసె
బాల్యావసరమున బాదరాయణముని
నిగమాదివిద్య లన్నియును నేర్పె
మునుపు వైశంపాయమునికి బొందిన బ్రహ్మ
హత్య శీఘ్రము పలాయనముఁ జెంద
సత్యసంధుండయిన జనక భూమివిభుండు
నీతికోవిదుఁడు నీ నెరయ మెచ్చ

గీ. భవ్యమంత్రాక్షతల సభాభవనమధ్య
పటుతర స్తంభముల పెల్లు పల్లవించె
యతివరేణ్యులు నీకెందరయిన సమమె
యాజ్ఞవల్క-మునీంద్ర! సర్వజ్ఞ చంద్ర! ॥ 14

గీ. హరిహర బ్రహ్మ నిర్జరేశ్వరులకైన
త్వరితముని నన్ను మెప్పింప తరముగాదు
పొలసివచ్చితి నీయాత్మ శుద్ధికిపుడు
వ......త్యంబు మునుల కెవ్వరికిగలదు ॥ 15

క॥ కావున నీవిధిఁ జెప్పిన
!తోవఁ !బవ రి.ంపఁగలవు తూర్ణంబున భూ

దేవాగ్రణి ! నీకిక యే
దేవతతోఁ గార్యమెల్ల దృఢసంపదకున్ ॥ 16

గీ॥ వస్త్రకపిలార్ణ భూమి సువర్ణముఖ్య
దానముల జేయునట్టి యా దాతృవరులు
జగతి కన్యకయును సరస్వతియు మంచి
ప్రాజ్ఞులకు నియ్యవలె నంద్రు తజ్ఞులనఘ ! ॥ 17

వ. అది గారణంబున మదీయ్యాశారదాఖ్యానంబునకుం బాత్రుండవు నీ వడిగిన యర్థంబునకు నొక వివరంబు చెప్పెద, తొల్లి నాయుం దనంతానంతంబులైన వేదంబులు సంభవించె, నవి యటమీఁద సోమకాసురునిచేత తస్కరింపంబడునని, శ్రీమన్నారాయణుండు హేమ్యకార్యం బెఱింగి, కొన్ని సూర్యునివద్ద పదిలంబుచేసె, తక్కిన యవి, ఋగ్యజుస్సామంబులు నరలోకంబున, ప్రబలంబై ఖ్యాతిమెఱసె, నీవు ఆదిత్యుం బ్రార్థించిన యెవ్వరికి ముఖ స్తంబులుగాని అపూర్వంబైన మూలంబు యామ్నాయంబు నీకు నొసంగును, పొమ్మని గాయత్రీమహాదేవత యథేచ్ఛఁ జనియె నపుడు. 18

గీ. అంత యాజ్ఞవల్క్య హర్షసంభ్రమములు
తన మనంబునందుఁ బెనఁగొనంగ
పద్మమిత్రుని ప్రార్థింప వలెనను
చున్న యంతలోన చెన్నుమీర ॥ 19

క॥ కమలంబులు వికసించెను
కుముదమ్ములు మట్టుమణిగె కోశములోనన్

తిమిరంబు లెల్ల బాసెను
తెమలుచు మరి దిక్కులెల్ల తెలతెలనయ్యెన్ ॥ 20

సీ॥ ఘనతరనేమి సంఘర్షణంబులు గండ
పాషాణములు నెర బయలుకొనగ
లలిత కాంతారంబులను భూరుహములపై
విలసిల్లు చల్లని విరులు వ్రాల
సమధికోన్నత బహుస్థానంబు చెక్కుచు
భుజగరాజంబులు బుసలుకొట్టు
శిఖి చయంబులు నెల్ల చెలరేగి పరుగెత్త
నురుకుచు పక్షులు నొరసియాడ

గీ॥ గంటిపలి సానుకటములు నొంటికట్లు
దొరగుచుండంగ వినతావధూటికొడుకు
భద్రమౌ స్యందనము నోల ప్రబలుచుండ
పూర్వశైలంబుపై నెక్కె పురుషుఁడపుడు ॥ 21

గీ॥ పాకశాసన శైలాగ్రభర్మ కుంభ
మనగవిధి హరిహర ని......న మనంగ
కుముదముల వైరి యనని......
నుగ్రకిరణుఁడు తూర్పున నుదయమయ్యె ॥ 22

వ. యిట్లు సూర్యోదయంబైన యాజ్ఞవల్క్య కాలోచిత కృత్యంబులు దీర్చి సూర్యనమస్కారములుచేసి శుచిభూతుండై పరాపరవస్తువైన భగవంతుని నిర్దేశించి యిట్లని స్తుతియించె. 23

—: సూర్య స్తుతి :—

వసంతతిలక వృత్తం.

సూర్యస్తోత్రం॥ గాఢాంధకార హరణాయ జగద్ధితాయ
జ్యోతిర్మయాయ నళినీదళలోచనాయ
క్రూరగ్రహప్రబల దోషవిభంజనాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమోనమస్తే ॥ ౧

ఛాయాప్రియాయ మణికుండల మండితాయ
అజ్ఞానకర్మహరణాయ దివాకరాయ
మందేహదైత్య భుజగర్వవిభంజనాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమోనమస్తే ॥ ౨

సౌవర్ణరత్నమకుటాయ వికర్తనాయ
విశ్వాయ పంకజభవేంద్ర సువందితాయ
శ్రీభాస్కరాయ జగతాం పరశోధనాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమోనమస్తే ॥ ౩

సూర్యాయ దీనభరణాయ జలప్రదాయ
తోయాపహార కరుణామృతపూరితాయ
నారాయణాయ సురలోకసుపూజితాయ
సూర్యాయ తీవ్రకరుణాయ నమోనమస్తే ॥ ౪

నారాయణాయ వరుణాయ నరేశ్వరాయ
గౌరీశపంకజభవస్తుత విగ్రహాయ
లోకేక్షణాయ తపనాయ దివాకరాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమోనమస్తే ॥ ౫

సప్తాశ్వసంగతరథాయ దినాధిపాయ
రక్తాంబరాయ శరణాగతవత్సలాయ
జాంబూనదాచలితసన్మణికుండలాయ
సూర్యాయ తీవ్రకిరణాయ నమోనమస్తే ॥ ౬

గీ॥ అని నమస్కారంబులు సల్పి యభినుతించి
యతిశయ జ్ఞానవంతుఁడై యాజ్ఞవల్క్య
దినకరునిమీఁద యేకాగ్ర దృష్టినిల్పి
నిశ్చయస్వాంతమునకు వర్ణింపదొణగె ॥ 25

గద్య. ఓం జయ జయ తపన తాపస జనహృత్కమలనివాస రవివస్వాంతా విశ్వకర్మ వికర్తన విశ్వరూప విశ్వకర్త మార్తాండ అంశుమాలి ఆదిత్య సహస్రకిరణా సాక్షిస్వరూప నిరామయ నిర్వికల్ప నిరాభాసా నిర్మల నిత్య నిరవద్య నిగమస్వరూపా నిగమవేద్యా నిరంజన నిర్గుణ నిరాధా...... నిరుపమా నిరవందత్య నిష్కళంకా నిరజా స్త అష్టాక్షరీప్రియా అమితప్రకాశా అత్యుతా ఆదిత్యా అర్క అతులపరాక్రమ అప్రమేయ ఆపద్బాంధవ అనాథరక్షణ అనంత వేదాంతవేద్య ఆగమప్రియ ఆత్మస్వరూపా ద్వాదశాత్మ సప్తాశ్వ సప్తరజ్జు ద్విభుజ భాస్కరా హాస్కర ఖగ సూరా సూరోత్తమా లోకలోచనా గ్రహేశ్వరా చతుర్దశభువన వ్యాపక ప్రకాశా అనంత తేజోనిధీ లోకసాక్షి లోకలోకాంత సంచారా దివ్యమూర్తి దివాకరా దివస్మృతి తీవ్రకిరణ తిమిరహరణా తరణా మహా అరణి ద్యుమర్గణా హరిదశ్వ అరుణగంధాక్షత ఫలపుష్పాభరణాంబర (పి.సూతమి)గహా దైత్యహర

పాపహార మహాప్రకాశా చిత్రమయూర దిక్పతిస్తోత్ర పాత్రా ఉష్ణరశ్మి పూష్ణ హిరణ్యగర్భచండమరీచీ కశ్య పాత్మజా త్రిమూర్త్యాత్మకా దీనజనరక్షకా సహస్రహస్తా దివ్యస్తుతి మహిర మిత్ర ఏకచక్రరథ ధర్మార్థకామ మోక్షప్రదా కోమలా కారుణ్యమూర్తి యాశ్రిత దాయకా నమస్కారప్రియా దయార్ద్రహృదయ స్రష్టా యీశ్వరా నారాయణా పరబ్రహ్మ నమోనమస్తే. 26

సీ॥ పద్మబాంధవ నీగభస్తిభయంబులు
లోకంబులకు నెల్ల లోచనములు
బుధముఖ్యులకు కల్పభూజముల్ మార్తాండ
విమలముల్ మీ చరిత్రములు ధాత్రి
జనులకు పాతకసంహారములు నిన్ను
సన్నుతిసేయ వశంబె జగతి
దినకర నీభవ్య దివ్యశరీరంబు
హరిహర బ్రహ్మల కాలయంబు
మందేహవైరి నీమంజుళ హృదయంబు
సకలవేదములకు స్థానభూమి
పంకజ మిత్రు నీపాదపద్మంబులు
బుధముఖ్యులకు కల్పభూరుహములు ॥ 27

గీ॥ చంద్రమార్తాండ నీ దివ్యచరితములను
ధాత్రిజనులకు సర్వవ్యథాంబుహరము
నిన్ను సన్నుతిసేయఁగా నేర్పుగలదె
కడగి నలువకు నైన ముక్కంటికైన ॥ 28

గీ॥ నేకచక్రంబు సప్తియు నేకతురము
సారథియనూరుఁడై సుప్రచారమునను
గగనమార్గంబునందున గడలె రథము
మిగుల చోద్యంబులగు దేవమిత్రతరుణి ॥ 29

వ. నీ ప్రచండస్యందనంబు నందందరాగవాలఖిల్యాది మౌని సంఘంబులు పరివేష్టింప నొక్కదినంబు ప్రకటంబైన చక్రంబు సువర్ణమయ శిఖరంబులంగల మహామేరు శైలంబు ప్రదక్షిణంబు సేయుదువని యందురు; కొందరు పూర్వశైలంబున బుట్టి గగనమార్గంబునం జని పశ్చిమాచలంబున గ్రుంకుదు వందురు. కొందరు దినదినంబున నూతనంబుగాఁ బొడమి బాల్య, యవ్వన, వృద్ధరూపంబుల వర్తింపుదువని కొందరందురు. సందేహావచనంబులకు నా డెందంబు గ్రందుకొని డిందుపడ కమదంబై యున్న యది భగవంతుడైన నీకు హానివృద్ధ......విసర్గంబులు గాని యుదయాస్తమన ప్రసంగంబుల ప్రకారంబులు యవరికి తెలియక నశక్యము లే, లోకంబులు సంరక్షింప దలంచి జగంబులఁగాంచి శీతోష్ణవర్షకాల వ్యవహార ప్రకారంబులు వహింతు వింతయుకాదు పృథివ్యాప స్తేజోవాయ్వాకాశంబులలోన, ప్రధానపురుషుండవు ప్రత్యక్ష దైవంబనితె భవదీయ మహిమంబున గోచరంబు యీ జగంబునకు దేవుడవని నీకు మ్రొక్కెదరు, బ్రహ్మ విష్ణు, మహేశ్వరులు, నీవు వేదంబులు, నీవు ఓంకారంబు. నీవు హోమంబు. నీవు భూధరంబులు.

నీవు జలంబులు, నీవు వీతిహోత్రుండవు, నీవు పవనుండవు, నీవుదక్క యీ కమలజాండంబున మరియొకరుండు లేఁడని ప్రతిజ్ఞావచనంబుగా బలికెద, నమోనారాయణా యనుచు, నమస్కారంబు జేసెద. 30

క॥ అనురాగంబున ననవుడు
వనరుహబాంధవుఁడు యాజ్ఞవల్క్యుకి నెదుటన్
కనుదనియ ప్రసన్నుండై
యనఘ! వరంబడుగుమనిన, యాతఁడు బల్కెన్॥ 31

వ. దేవా! దివ్యమంగళవిగ్రహా! యొక్క ప్రవాదంబున, వైశంపాయనునివద్ద జదివిన, యామ్నాయంబు, మరలం గ్రక్కి, యజురామ్నాయ రహితుండనై, యున్నవాఁడ, నందెవ్వరికి ముఖస్తంబుగాని, అపూర్వంబై, పరమపవిత్రంబై, యట్టిదిగా వెదకిచూచి నూతన నిగమంబు నాకు ప్రసాదింపవలయు ననిన, సూర్యుం డిట్లనియె. 32

క॥ సాకల్యంబుగ నిగమా
నీకంబులు నాముఖమున నిలుచుటలెల్లన్
నీకేవిధమున వినఁబడె
నాకార్యము లెల్లజెప్పు మాద్యంతంబుల్॥ 33

వ. అని యాజ్ఞవల్క్యు దివాకరున కిట్లనియె. దేవా! నీకు గ్రాహ్యంబుగాని దేదిగలదు, నీవు చూడని దేమున్నది, నిన్నెఱుంగక యేమి కార్యంబులు నడుప శక్యంబు లెవ్వరికింగలదు, అయినను నాయందలి పరిపూర్తిః కరుణ

గలవాడవై నామాటలు వినవలసి అడుగుదువుగాక విన్నవించెద కర్మసాక్షి, జగచ్చక్షువని పూర్వకాలం బున శ్రీమన్నారాయణుండు, విశ్వప్రపంచ, వ్యవహారం బులు నాకు గర్భస్థుండున్నకాలంబును, కరతలామల కంబులుగా దెలిపి పరబ్రహ్మజ్ఞానోపదేశంబుచేసె, నట మీద గాయత్రీమహామంత్ర దేవతవలన నీవు వేద మూర్తి వగుట యెఱింగితి నని పలికిన, యాదిత్యుం డిట్లనియె. 34

—: సూర్యుని సంభాషణ :—

గీ॥ ......య్య గర్భంబునం దమ సకల
వేద సంఘంబు లున్నవి విప్రవర్య !
నీకు దెలిపెద నిఖిలంబు నిగమ వేద్య
మైన కలదిప్పుడొక్క కార్యంబు వినుమ ॥ 35

వ. మహాత్మా, మదీయ, స్యందనము నిమిషంబున గగన మార్గంబున, లక్షయోజనంబులు నడుచుచు నొక్కింత తడవు తడసినకాలంబు విపర్యాసంబగు గావున నాకు నిలువ తాలిమిజాలదు, అందు నుపాయంబుజెప్పెద జలధి నడుమ బడబానలంబు కడ జవసత్త్వంబులుగల తురం గంబులున్నవి మద్వంశసంభవంబులు యశ్వంబులందెచ్చి సారథ్యంబున నిడుము నీకు నిగమంబులు జెప్పెదననిన యతని సామర్థ్యంబులు తెలియగాఁ బనిచిన. 36

క॥ అతఁడేగి శైలకానన
వితతులు కడుగడచి భువనవిఖ్యాతంబై

యతులిత కమల సమూహా
ద్భుతమగు దుగ్ధాంబురాశి పొంతకు జనియెన్॥ 37

వ॥ తదంభోధిజలంబులం గృతస్నానుండై సంధ్యాది నిత్య కృత్యంబులు దీర్చి, గాయిత్రీ మహామంత్రంబు జపియించి హరునకు నమస్కారంబుచేసి ప్రశస్తంబుగా హస్తంబులు ముకుళించి త్రేతాగ్ని స్వరూపంబైన వీతిహోత్రు నిట్లని స్తుతియించె. 38

—: అగ్నిహోత్రుని స్తుతి :

సీ॥ పావక శిఖ సర్వభక్షక పవనాప్త
విజయ ధనంజయ వీతిహోత్ర
సప్తజిహ్వానల సప్తార్చిహుతవాహ
జ్వాలావళీవని వాజితేజ ?
ధూమమధ్యకృశాను ధూమమేచకమార్గ
వరమేషవాహన వాయుమిత్ర
గౌరవార్ణ్లహరుణగహనాశ నావ్యయా
లోహితమోచనా లోకరక్ష

గీ॥ దేవదేవేశ సర్వేశ దేవమధ్య
అక్షయాంశ బృహద్భాను ఆదిదేవ
సకలదేవాత్మరూపక శరణు శరణు
అఖల సురముని సమ్మిత్ర అగ్నిహోత్ర !॥ 39

గీ॥ నీవలన తృప్తిగాంతురు నిర్జరులును
తనయ ఫలములు నాచేతి దాతనీవు

నీకె కనుపట్టు వేల్పు విలోకమునను
దలప నినుఁబోలు దైవంబుగలదె జగతీ॥ 40

వ. అని పలికిన యగ్నిసూక్తంబులు పఠియించిన మేషారూ
ఢుండును గౌరవ వర్ణుండును జటాబంధుండును మహా
తేజస్కుండును సమస్తజిహ్వుండును ధూమధ్వజుం
డును లోహితాక్షుండును ద్విముఖుండును త్రిపాదుండును
రక్తాక్షుండును స్వాహానాథుండైన అగ్నిహోత్రుండును
ప్రత్యక్షంబై నంద కందళిత హృదయారవిందుండైన
యాజ్ఞవల్కుఁ ప్రదక్షిణపూర్వకంబుగా నమస్కారము
గావించి యిట్లనియె. 41

క॥ బడబానల నేచంతను
బడలములు న్నవియటంచు భానుఁడు పనుపఁ
వడి నేగుదెంచినాఁడను
తడయక దయసేయవయ్య దత్తురగములన్ ॥ 42

క॥ మబ్బులిడె నేడు రేపని
సబ్బిక నెడబడక జరిపిసందకముల్
గొబ్బున నిలిచినవాఁడే
దబ్బరగాడని యటంద్రు ధరణి బుధేంద్రుల్ ॥ 43

క॥ సద్యోదదాతి చతురః
సద్యోనాస్తి యను శాస్త్రసరణియు మెఱయఁ
సద్యఃకాలము నందున
తధ్యంబున నిచ్చువాఁడు ధన్యుఁ డనఁదగున్ ॥ 44

గీ॥ గంగ మొదలు నదులు కడలిలో కలబడిః
నీరు కేళిబొంగి నింగి మట్టి
వెల్లి విరియుచున్న వేగనీకిత్తువు
వాయుసఖుఁడయిమ్ము వాహములను ॥ 45

—: బడబానలుని సంభాషణ :—

వ. అనిన యతని యధికత్వంబునకు, మెచ్చి బడబానలుఁ డిట్లనియె. 46

వ. మునీంద్రా! నాయందుల ప్రభాకరుం డశ్వంబులను నిచ్చుట నిజంబది యట్లున్న మున్ను చండభాస్కరుని ప్రచండ తేజంబునకు సహింపనోపక యేను సౌందర్యరూప విభ్రమంబువిలాసాలంకారపురంబులు దనయట్లనె యుండు నట్లుగా ఛాయ యనుదాని నిర్మించి తరణి దగ్గర నునిచి నీ సముద్రద్వీపంబున గొడుగై విహరింపుచుండె నయ్యెడ నదియు నొక్క యపరాధంబున ఛాయ మునికొడుకుని నోడక కడు క్రోధంబున శపియించె. నయ్యంబురుహ బాంధవుండు తద్వృత్తాంతంబంతయు నెఱింగి యది తన భార్యగా నుండుటం దెలిసి దాని శాపవిమోక్షణంబు జేసి విచ్చలవిడి సంగంబు జేసిన నత్తురంగియందు నశ్వినులను యిద్దరు కొడుకులు నీ యశ్వంబులంబుట్ట యశ్వినులు దివ్యౌషధంబులు గలవారలై దేవదైత్యులై చనిరి. వెండియు నీ ఘోటకంబుల్లు బుచ్చిన వీటి నిచ్చటనే యునిచి యినుం డరిగెనని చెప్పి హయంబులు నిచ్చి యాజవల్కిని సమాన బహుమానంబులు గావించి

యమోఘంబులయిన గొన్నివరంబు లొసంగి బ్రహ్మణ్య
తేజోనిధి నేను నీకు వశ్యుండనని ప్రియంబులు బలిచిన.47

—: యాజ్ఞవల్క్య గుఱ్ఱంబుల దెచ్చుట :—

గీ॥ యాజ్ఞవల్క్య మిగుల యానందచిత్తుఁడై
ఘోటకములు బట్టుకొనుచువచ్చి
సూర్యునెదుట జెప్పి చుట్టుతా వలకొని
మోడ్చి చేతులవుడు మ్రొక్కి నిలువ ॥ 48

క॥ ఆతని సత్కృతమునకును
ప్రీతుండై యాజ్ఞవల్క్య పిలిచి మహాత్మా!
నీ తపమెట్టిఁగెడి కతమున
వీతుల తెమ్మంటి జగతి విఖ్యాతముగన్ ॥ 49

క॥ నీవును వాటిని దెచ్చితి
దేవతలకు దుస్తరంబు దెర దెవ్వరికిం
గావున మేటి సమర్థుఁడ
వీవేయని నుడివివేడ్క విద్యయు నొసగున్ ॥ 50

వ. అది గావున పరబ్రహ్మముఖోద్భవంబైన వేదంబులు నాయం దనంతరంబులు గలవు, అన్నిగమంబు లమోఘంబులై వీర్యంబై బ్రహ్మసాక్షాత్కారంబై సుస్వరంబై ప్రధానంబై ఆదియై అపూర్వంబై ఆదిదైవంబై ఆనందంబై అసమానంబై పరమపవిత్రంబై బ్రహ్మస్యమర ప్రముఖసన్నుతంబై పాపహరంబై పరంబై సర్వమంత్రాత్మకంబై సకలంబై సర్వాగమంబై ఋషిచ్ఛందోబద్ధక్రమంబై వేదాద్యనంతశిరోరత్నంబై మహిమంబై మహాతి

శయనంబై యుండునట్టి నిగమమూలంబు నీకు బ్రసా
దంబునఁ నిచ్చెదమని బడబాశ్వంబులు బూనిన నొక్క
దివ్యరథం బెక్కించుకొని యాజ్ఞవల్క్యుని దోడ్కొని
విభావసుండు నభోభాగంబున కుద్గమించెనప్పుడు. 51

—: సూర్యుఁడు శుక్లయజుర్వేదము యాజ్ఞవల్క్యున కుపదేశించుట :—

సీ॥ ఆకాశగంగా మహా సైకతంబుల
ఖురపుటంబులు గ్రుంగి కుటిలపడగ
సంఖ్య కేతూగ్రహాశు...... గంభీరోగ్ర
కఠినాగ్ర దంష్ట్రల గాటుపడగ
విబుధ భూధర శృంగ విషమ గోళోపల
పరుష స్థలంబుల పట్టుపడక
శంపాలతా వృత్త జంఝూనిలోద్భూత
జీమూతములలోన చిక్కుపడక

గీ॥ ..............................
వనజ బాంధవు రథముతో వడిన బరుచు
దివ్యరథమెక్కి జనుదెంచి దివ్యమార్గ
మునను యా యాజ్ఞవల్క్యుఁడు మునివరుండు ॥ 52

క॥ చయ్యన గగనపథంబున
వయ్యాళింపుచును చనియె వరబల మమరన్
నయ్యాజ్ఞవల్క్య రథమున
నెయ్యంబున గట్టినట్టి నిజవాహంబుల్ ॥ 53

వ. యిట్లురువురు ననంత విద్యావిలాసంబున జనుచు భాస్వం
[illegible]

శిక్షాకల్ప, వ్యాకరణ చ్ఛందోజ్యోతిష, నిరుక్తంబులను,
......ర్ణ...రుముషయంబులను నలుబదినాలుగు సంహి
తలను నిర్ణయించి శుక్లయజుస్సును యజుర్వేదారుణద
పరాయదీ బ్రహ్మారుణ్య యుక్తంబున చెప్పి యతిధి
భోధాచరణ ప్రచారంబులును నిగమాదివిద్యలును పదునా
లుగు నొసంగి వెండియు మారణసంజీవన ప్రముఖంబు
లైన మంత్రౌషధంబు లెఱింగించి భూతభవిష్యద్వర్తమా
నంబులు దెలిసె నట్లుజ్ఞానోపదేశంబుజేసి బ్రహ్మణ్యాగ్రేస
రుండవై చనుమని పంచిన :— 54

క॥ అతఁడు సమస్తవిద్యలు
నాతీక్ష్ణ మయూఖువద్ద నభ్యస్తుండై
నూతన పారాశ్యరు
భూతివిజృంభించె సరసపాండిత్యమునన్ ॥

వ. యివ్విధంబున యాజ్ఞవల్క్య దివాకరుని చేత ననుజ్ఞా
తుండై మునిజనలోకంబున కరుదెంచుటయు, చిత్రరథుం
డను గంధర్వుండువచ్చి వడ్డాలంబున నిట్లనియె... 56

—: చిత్రరథుని సంభాషణ :—

గీ॥ యతివరేణ్య ! యిప్పు డబ్జమిత్రునివద్ద
చదివి దనది వేదశాస్త్రములను......
నాకు ఝుడితియిమ్ము న్యాయమార్గంబున
యీాకపోతివేని యేల విడుతు ॥ 57

క॥ నీవేమి శబ్దశాస్త్ర
ప్రావీణ్యత నొంది తనుచు పరదెంచితివా

వైదేవజ్ఞుల పరిభూతుల
గావించితి మీఁకునియ్యఘనవాక్ ప్రౌఢిన్ ॥ 58

వ. అనిన గంధర్వుం డిట్లనియె నీకు సర్వజ్ఞత్వంబు గలిగె ననియు లోకవృత్తాంతం బడిగెద బ్రహ్మ విష్ణు మహేశ్వరుల నెవ్వరికి సర్వజ్ఞత్వంబు గలుగు వేదంబు లెవ్వని వినుతింతు శాస్త్రంబు లెవ్వని వక్కాణించు, పురాణంబు లెవ్వనిగణుతించు, సకలచరాచర జంతుసంఘంబు లెవ్వని యందునుండు, లోకంబులెవ్వని కుక్షియందుండును దేజరిల్లు సిద్ధాంజనంబు దొరికిన సమగ్రుండు ధనంబు చూడెడి విధంబున నిత్తెరంగు నామనంబునకు ప్రదీపికంబుగా జెప్పితి వేని నీకు భృత్యుండ నయ్యెదనని ప్రజ్ఞావచనంబులు బల్కిన దరహాసితవదనుండై యాజ్ఞవల్క్యుం డిట్లనియె. 59

క॥ నీ వడిగిన యామ్నాయము
కోవిదులకు వేదముల నగోచరము మహా
భావజ్ఞులు దక్కగ నిది
భావించగ లేరు తెలియబడగ మహాత్మా ! ॥ 60

వ. అయినను వేదవేదాంత శాస్త్రప్రసూక్తంబులను, నిర్ణయించిన తెరంగు జెప్పెద లోకంబులో దృష్టంబగు వస్తువు నష్టంబగు, నిరాకారంబునకు విలయంబుబట్టందు యీ కందర్పమదనేంద్రిరారమణీరవిందగర్భులకు కాల పరిణామంబులు గలవు. వారు, తత్ప్రకారంబుల హాని వృద్ధులం బొందుదురు, యమ్మువ్గురికి నగ్గలంబై నిరవయ

మంబును నిరంజనంబును నిరవలంబును నిరుపద్రవంబును నిష్కళంకంబును నిరంకుశంబును నిరాధారంబును నిశ్శబ్దంబును నిత్యంబును నిశ్చయంబును నిర్మలంబైన మహాతత్వం బనంతభాస్వంత ప్రకాశంబైన యంతరిక్షంబున దేజరిల్లుచునుండు నయ్యాదిమ బ్రహ్మంబు లీలావినోదంబులు నిర్మింపం దలంచి స్త్రీపురుష రూపంబులఁ గలుగజేసి తన్మధ్యంబున పృథివ్యాప స్తేజోవాయ్వాకాశాత్మకంబులై దేహంబులం బొడమె నందు కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యంబులు శత్రువులయ్యె నందు రాజత సామస సాత్వికంబులు గుణంబులు త్రివిధంబు లయ్యెనందు రాజసంబునకు రాజీవగర్భుండును సాత్వికంబునకు హృషీకేశుండును తామసంబునకు రుద్రుండును నధిపతులైరి. వీరురాజమానసులై హిరణ్యం బొక్కటి బనేకవిధంబుల నాభరణంబగు తెఱంగున వస్తువు నొక్కటయిన యనేకవిధంబులుగల తెఱంగున వటబీజన్యాయంబున దారువందు నగ్నియుండు చందంబున ఘటంబులోని దీపకళికముబోలి ప్రకాశించుచుండుదురు. యుత్పత్తిస్థితిలయంబులకు కారణకర్తలై యుండుదురు. ఈ ప్రసంగంబులకు నొక్క యితిహాసంబు గలదు. సనత్కుమారుండును పరమేష్ఠిమానసపుత్రుండు గంధమాదనంబునం దపంబు సేయ దాత్రాదులం జనుదెంచి వరంబు వేడుమనిన యదృష్టాంత నష్టంబును వేదవచనంబు

లనిన లజ్జాపరవశులై చనిరి. యిది యట్లుండె, పృథివ్యా
పస్తేజోవాయ్వాకాశంబులువలన, చర, ధూమాంధకారం
బుల, చిత్ప్రకాశుండై వెలుంగు నెవ్వడు వాఁడే, సకల
భువనంబులకు నాథుండని పలికిన. 61

క॥ తనబుద్ధికి సరిపోయిన
పునతర సన్మార్గమిదియె కావున చిత్తం
బున మెచ్చి యాజ్ఞవల్క్యకి
యనురాగముతోడ యమ్మహాత్ముఁడు పలికెన్ ॥ 62

వ. మునీంద్రా, స్వర్గ, మర్త్య, పాతాళలోకంబులలో చతు
ర్యుగ సహస్రంబులలో, సకల శాస్త్రవేత్తలం, బరీక్షించి
చూచితిగాని, నీయంత విజ్ఞానవంతుని, కనివిని యెఱుంగ
గావున, నీకు శిష్యుండనై యుండెద ననిన యా గంధ
ర్వుని బరిగ్రహించి గోదావరితీరంబునకుం జని అచట దన
పేరట యాజ్ఞవల్క్య పురంబున నొక్క నగరంబు నిర్మించి
యందును ప్రవేశించి ఆశ్వలాయన మునికన్యకను వివా
హంబై గృహస్థధర్మంబున, దేవఋషి, పితృవుల ఋణం
బులు దీర్చుచు, జాబాల, కణ్వ, మార్కండేయ, మాధ్యం
దినా, తాపసీయ, నీయ్య, కాపాల, పౌండ్రవత్స, ఆవ
టిక, పరమావడిక, ఉత్స, పారాశర్య, వైధేయమైన
తేయ జౌఘేయ, గాలవ, పైలవ, కాత్యాయన, ప్రము
ఖులగు, శిష్యసంఘంబులకు, ఋగ్యజుసామాథంబు

సీ॥ యమనియమాసనప్రాణాద్యష్టాంగ విధముల
కిరవైన రాజయోగీశ్వరుండు
వేదవేదాంతాది వివిధశాస్త్రార్థముల్
కడదాక నెఱిఁగిన ఘనవరుండు
పరమధర్మాధర్మపదము లెప్పాటుగా
భూమినేలిన నృపపుంగవుండు
మానులకెల్ల సమ్యగ్జ్ఞానపద్ధతుల్
దెలిపిన పరమోపదేశికుండు

గీ॥ పాదమొక్కటి బహుదుగ్రపావకమున
చరణమొక్కటి కర్పూరచందనమున
నిలిపి సుఖదుఃఖములు సమంబులుగనడుచు
దేవసదృశుండు జనక ధాత్రీశ్వరుండు ॥ 64

—: జనకుడు యజ్ఞము చేయబూనుట :—

వ. తత్కాలంబున రాజసూయాద్వరం బుపక్రమింప సలక్షణ
యుక్తంబులుగా హోమశాలలు నిర్మించి వశిష్ఠ వామ
దేవ వాల్మీక పరాశర వ్యాసవైశంపాయన శుకశౌనక
ఏకదాల్భ్య గౌతమాది మహామునుల రావించి యాజ్ఞ
వల్క్యను మునీంద్రుని రావించిన. 65

క॥ అరువదినలువురు శిష్యులు
పరివేష్టించుకొనివచ్చి పదవర్ణ జటా
స్ఫురితంబులు నిగమంబుల

క॥ నీరజగర్భుని కై వడి
నారాయణురీతి నిటల నయనుని పగిదిన్
నారాధి యాజ్ఞవల్క్యుఁ
డారయ చనుదెంచి సంభ్రమాక్రాంతుండై ॥ 67

ఆ. వె॥ జనకుని నాజ్ఞఁబూని సకలసంయములును
శిష్యగణములెల్ల జేరికొల్వ
హారిణ చర్మదండ వరజటాకౌపీన
వల్కలములు మెఱయ వచ్చిరపుడు ॥ 68

వ. యిట్లఖిల తాపసగణంబులు చనుదెంచినవారల నెదుర్కొని యజ్ఞశాలాంతరంబుల నుచితాసనంబుల గూర్చున్నపిమ్మట జనకుండు యాజ్ఞవల్క్య చెప్పిన ఆజ్ఞాక్రమంబున శుక్ల యజుర్వేదాగమ సాంజ్ఞాప్రకారంబున నధర్వంబు సమాప్తంబుజేసి యవభృతస్నానాంతరంబున తత్సభాసదులం గనుంగొని జనకుం డిట్లనియె. 69

గీ॥ సంయమీంద్రులార ! స్వర్ణధేనువులను
పుణ్య దక్షిణలను పొందుపఱచి
దానమియ్యవలయు ధరణీసురులకిందు
ప్రథమ పూజ్యులెవరు బలుకుడనిన ॥ 70

గీ॥ నిందితంబులైన నిగమ పరిగ్రహా
భయముగలదుగాన పరమఋషులు
తలలు నిక్కిచూడ తమతుశక్తులుగాక

వ. యంతట మునివర్యులు యమ్మానవేంద్రుని పలుకులకు ప్రత్యుత్తరంబు జెప్పజాలక,పరస్పరనిరీక్షణంబు జేయుచున్న

గీ॥ యపుడు భూమివిభుని యాస్థానముననున్న
విప్రవరులు నురలు వెఱఁగుపడగ
కడు విజృంభణమున ఘనపునరవము నా
యాజ్ఞవల్క్యులుండు ననియె పలికె ॥ 73

—: యాజ్ఞవల్క్య సువర్ణగోదానంబు పొందుట :—

వ. నరేంద్రా! పూర్వకాలంబున బ్రహ్మరుద్రాచ్యుతులు తన కంటె దైవంబులేదని వికర్తింప, నాకాశరూపంబైన యమ్మహాతత్వంబని పలుకంబడియె, కావున, యేను నీ తాపసులందరు విన నొక్క వాక్యంబు వక్కాణించెద, భవదీయ స్వర్ణగోదానంబు పరిగ్రహింప నేను ప్రథమ పాత్రుండ నని పలికిన. 74

క॥ జగదీశ్వరి గాయత్రీ
భగవతి యీయాజ్ఞవల్క్య ప్రథముం డితడే
తగు నీదానంబున కని
గగనము ఘోషించె దేవగణము బలికెన్ ॥ 75

క॥ జనకుండా మునిమహిమలు
తన మానసమునకు మిగుల...ణగుటం
విని యాశరీరవచనంబుల
కనురాగమునొందు విస్మయాత్ముం డగుచున్ ॥ 76

వ. తదనంతరంబు నక్షత్రగణంబులలో సోముని తెఱంగున,

మధ్యంబున తేజోవిరాజితుండై ప్రకాశించుచున్న యాజ్ఞ వల్క్యమునిపాలికి జనకుండు భార్యాసమేతుండై వచ్చి గంధ పుష్పాక్షతల బూజించి మధుపర్కంబు లొసంగి యపుడు. 77

శ్లో॥ గోమయం యమునాసాక్షాత్ గోమూత్రం నర్మదా స్తథా
శుభా చ గంగాక్షీరం తు యా సాగ్రై రే మతఃపరం
గవామంగేషు తిష్టం తు భువనాని చతుర్దశ
యాస్థాత స్సాచితం మన్యే అంతస్సాంతం ప్రయచ్ఛమే॥78

వ. యను మంత్రంబులు బ్రాహ్మణోత్తము లుచ్చరింప, సంపూర్ణ దక్షిణ పూర్వకంబుగా సువర్ణధేనువు ధార బోసిన, నతండు తద్రాజజలంబులు దక్షిణహస్తంబున బరిగ్రహించె నయ్యెడ. 79

గీ॥ సకలమైనయట్టి శాఖలమునులలో
యాజ్ఞవల్క్య మిగుల నధికుఁడగుచు
ధరణిలో ప్రధానదానార్హుఁ డగుటను
ప్రథమశాఖ యనఁగ పరిణమించె। 80

వ. వెండియు, జనకుండు, భూసురులకు యనేక సహస్ర సంఖ్యలుంగల సువర్ణధేనువులను, మణిమయాంభర దానాది షోడశ మహాదానంబులం జేసి హవిర్భాగంబులు దేవతాసమూహంబుల కొసంగె నపుడు. 81

గీ॥ గౌతమాత్రిశక్తి కణ్వ పరాశర

శౌనకాదులయిన సకల సంయములును
యాజ్ఞవల్క్యుమీఁద నాగ్రహమున ॥ 82

సీ॥ వేదవేదాంతాది విద్యలు శోధించి
సకల శాస్త్రంబులు జాడ లెఱిఁగి
తర్కమీమాంస సూత్రములను ఛేదించి
మంత్రతంత్రముల క్రమంబు వొరసి
బ్రహ్మకులాచార పద్ధతుల్ బాధించి
..............................
వెలయు ప్రాయశ్చిత్త విధము లెఱిఁగి
ర్త దేవతాంతరములు దెలసి లోకప్రవర్తనలు

గీ॥ గలుగు వార్త లనుకరించి
........................
చిరజలప్లవ గలవెను పాదములకు
తారసిల్లి రధిక దర్పములను ॥ 83

వ. యిట్లు అఖిలసంయమునను తనమీఁద వాదనంబునకు దగిలిన, వారికి ప్రత్యుత్తరంబు పిడుగులు బోలు వాగ్వి జృంభణ గంభీరనినాదంబుల వుదాహరణంబులిచ్చుచు వాక్ స్తంభనంబులను మాడ్కి నోళ్లు మూయించుచు, ఆత్మగతంబున, 84

గీ॥ తరణి పుత్రపాశ ధరయమునాఖ్యాత
దండధర కృతాంత ధర్మరాజ
శమన దేవదేవసంజ్ఞా తనూభవ

వ॥ అని యిట్లు వినుతించి యిపుడు జనకుండు ద్విజులకు దానంబులిచ్చిన సువర్ణధేనువులు నిర్జీవంబులు గావున వాటి నపహరించు చండాలులం గల్పించి పనుపవలయు నని ప్రార్థింపం జముండును తమ జనకుం డతనికి హితుండు గావున యాజ్ఞవల్క్యుని మాట లాలించి తత్కార్యంబునకు హర్షించి శంకాటంకంబులేక కింకరులు బనిచిన. 86

—: చండాలులువచ్చి స్వర్ణ పశువులను దోలుకొనిపోవుట :—

సీ॥ తోలునాఁడు మఱునాఁడు దోర్లిపోయినయట్టి
మురికిదూడలు కొన్ని మోచుకొనుచు
పరుడ? నెనుపోఁతు పచ్చి చర్మంబులు
కరుకు మేనులమీద కప్పుకొనుచు
మాగిన పసరంపు మాంసఖండంబులు
బెట్టుగా కావిళ్లు బెట్టుకొనుచు
గొాటెలగాకర కుట్ల నంజుళ్లను
తరుచుబుగ్గల కల్లు ద్రావికొనుచు
గీ॥ దిట్టమై యినుపగుదియలు ద్రిప్పుగొనుచు
సారెకుసారె శంబళి, శంబళనుచు
యముని భృత్యులు చండాలు లగుచు వేగ
వచ్చిరప్పుడు మేదినీ వరునికడకు ॥ 87

వ. యిట్లతిభయంకరులగు కింకరులు ప్రచండ ప్రతాపంబున చండాలురై పొడమిన అఖలగదాదండంబులు ద్రిప్పు కొనుచు దెప్పరంబుగా నుప్పరంబు లెగయుచు సంహార

గవళి ధరణీత్రిదశుల నదలించి నిర్జీవంబులైన బంగారు
మొదవుల నపహరింపం దొడంగిన.

సీ॥ అగ్నికుండంబుల నాహుతుల్ వేల్పుంచు
వెఱచుచు తమకించి వెడలువారు
వేదశాస్త్రంబులు విదళించి చుట్టక
చంకలనిడుకొని జరుగువారు
జడలు ముడులువీఁడి సడలచెన్నులవ్రాల
జక్కిజాయగ దెసజరుగువారు
కాషాయవస్త్రముల్ ఘన కమండలములు
ధరణిపై బడవైచి దాటువారు

గీ॥ వైరిజాబాలి బకహారితాత్రికుత్స
కపిలగాధియకౌండిన్యకణ్వవత్స
శౌనకశమీక వామన చ్యవనముఖ్య
సంయమీశ్వరులతిభయ సహితులగుచు ॥ 89

శా॥ ఆక్రోశావాల మాలకించి కపట వ్యాపార చండాలురన్
సాకల్యంబున బిల్వబంచి జనకక్ష్మా భర్తయున్ వారిఘో
రాకారంబులు జూచిజూచియపుడే యాశ్చర్యచేతస్కుఁడై
వైకల్యంబున నిట్టులంబలికె దుర్వారాగ్రహావేశుఁడై ॥ 90

గీ॥ ఏమి చండాల భటులార! యింతలేసి
పనుల కిపుడెత్తుకుందు రీ పట్టణమున
యీతిబాధలు నేనేలు భూతలమునఁ
బుట్టదని భూమిజనులెల్ల పొగడవినరే ॥ 91

క॥ యిదియేమి కారణంబున
పదపడి నా యాజ్ఞమీఱి పరమాప్తుల భూ
త్రిదశేంద్రుల బెదరింపుచు
పదరి హరించితిరి, దగున పసిఁడి మొదవులన్ ॥ 92

గీ॥ అనుచు అత్యంత కోపప్రయత్నమునను
జనకు భూవిభుడును పౌరుషములు బలుక
నేలజాగిలి మొక్కి చండాల భృత్యు
లెదుట చేతులుముకుళించి యిట్టులనిరి ॥ 93

వ. నరేంద్రా! మీరు సర్వం సహాచక్రంబు నిర్వక్రమంబుగా నేలు పరాక్రమవంతులగుట నెఱుంగుదుము మున్ను నిర్జీవంబులైన పశువులు చండాలద్రవ్యంబులని పలికితిరి యిక్కార్యంబుల ధర్మాధర్మంబులు మర్మంబు తేర్పరచి యానతియ్యవలెనని పలికిన. 94

క॥ విని చండాలుర మాటలు
ముని కొని యొక కొంతధర్మమూలము లగుటఁ
జనకవిభుఁడు తోఁజాలక
మునివరులను చేరఁబిలిచి ముదమున బలికెన్ ॥ 95

క॥ మునులార! మీ కొసంగిన
కనకపు ధేనువులు తగవు గల్పించి తుదం
గొని చనియెదమని వచ్చిరి
జనునే చండాలభటుల సత్కార్యముగన్ ॥ 96

గీ॥ మాలలకు మాటలేకుండ మన సువర్ణ
ధేనువులకెల్ల ప్రాణము వేనొసంగి

మీ నిజాశ్రమములకు నడిపించుగ దాగుడనిన
యూరకుండిరి మరియొక్క యుపమ లేక ॥ 97

—: యాజ్ఞవల్క్య ఋషి బంగారుఆవులకు ప్రాణంబు లొసంగుట :—

వ. యిట్లు మహామునులు మౌనంబులు వహించి తత్కా
ర్యంబున కియ్యకొనక నేరకయున్నవారి మహత్వంబు
లెంతయు తా నెఱింగి భూకాంతుండు మహాప్రాజ్ఞుండైన
యాజ్ఞవల్క్యపాలికిం జని ప్రణమిల్లి యిట్లనియె. 98

సీ॥ సంయమితిలక ! నీ సరసవాక్యంబులు
పరికింప వేదాంత భావణములు
సజ్జనశ్రేష్ఠ ! నీ సకలనైష్ఠికవృత్తి
సకల శాస్త్రపురాణ సమ్మతంబు
ధరణీసురేంద్ర ! నీ కరుణాకటాక్షంబు
అఖిలంబునకు జీవనౌషధంబు
ధాత్రీసురేశ ! నీదారుణ కోపంబు
దావపావక శిఖాతతి సమంబు

ఆ. వె॥ దినము నీవొసగిన దీవెనల్ నృపులకు
భూరిసంపదలకు కారణములు
నిన్ను సన్నుతింప నేనెంతవాఁడను
యాజ్ఞవల్క్య ముని కులాగ్రగణ్య ॥ 99

వ. స్వామీ ! యేను దానంబుజేసిన సువర్ణధేనువులు నిర్జీ
వంబులని చండాలు లపహరింపం దొడంగిరి. శౌనక,
భరద్వాజ, చ్యవన, మార్కండేయ, కణ్వ, కపిల, బక
దాల్భ్య, వైశంపాయన ప్రముఖులు తత్కార్యంబు విహా

తంబు సేయనోపరు. మున్ను మీకు సూర్యనారాయ
ణుండు సంజీవనీమంత్రం బుపదేశించినవాఁడు గావున
యీ గోగణంబులం బ్రతికించి నన్ను కృతార్థునిం జేయ
వలయునని జనకుఁడు నమస్కరించి పలికిన. 100

క॥ పరమామృత తుల్యములగు
నరనాథుని వాక్యములకు నయముగ హరియుం
పరితుష్టమానసుండై
మురిపెంబున యాజ్ఞవల్క్య ముని యిట్లనియెన్ ॥ 101

క॥ జననాయక ! నీ విటువలె
వనటలఁ జెందంగనేల వాలాయముల౯
కనకపు ధేను గుణంబుల
పసుపడి ప్రాణంబులొసగి బ్రతికింతు నికన్ ॥ 102

క॥ దానము నీచే నందిన
మానిశ్రేష్ఠుల నిజాశ్రమంబులకడ నీ
ధేనువులను నడిపించెద
భానుసమానాభ మత్ప్రభావముకర్తన్ ॥ 103

వ. అని సంజీవినీ మంత్రము లుచ్చరించి కమండలోదకంబులు
ప్రోక్షించిన నిచ్చలంబులుగా ప్రాణంబులువచ్చి వాఁడల్లు
విదలించుకొని వాలంబులు విసరుచు శృంగంబు
లాడించుచు అంభోయనురవములు సేయుచు దూడలాఘ్రా
ణించి నాకుచు పొదుగుల క్షీరప్రవాహంబులు గురియుచు

నంబులకు భోరున దూరస్థులు పట్టువదలి నెట్టన దైవజ్ఞుం
డైన యాజ్ఞవల్కికి నమస్కరించి చనిరపుడు. 104

క॥ జననాయకుండు ప్రియమున
వినుతించెను యాజ్ఞవల్కి వేయివిధములన్
ఘనులగు సంయ్యములందరు
ననురాగం బెసగజనిరి యాశ్చర్యముతోన్ ॥ 105

వ. అని శౌనకాదిమహామునులకు సూతుండు దయాసమే
తుండై వక్కాణించిన తెఱంగునజెప్పిన, తత్సభాసదులు
యటమీఁద వృత్తాంతం బెట్టులయ్యెనని యడిగిన. 106

గీ॥ అనిన మంజుభాషణావధానులకుఁదా
ప్రథమపూజ్యుఁడైన పట్టభద్రు
లంతమీఁదనైన వ్యాఖ్యాన మెట్లని
వినయమార్గములను విన్నవింప ॥ 107

మ॥ ద్రుతసంరక్షితకార్యధుర్యధరణీ దేవోత్తమాశీర్వచా
లితత్రైశ్వర్యగుణాభిరామ సకలోర్వీనాయకస్తవ్య వి
శ్రుతవాగ్జృంభణ ధైర్యహేమధర సంస్థాయక్రియాశీవస
న్మతసంచార మహోద్ధతారిపటవీ మత్తేభపంచాననా॥ 108

క॥ రుద్రాక్షమాలికాధర
రుద్ర సమారాధనా నిరూఢచరిత్రా
రౌద్ర ప్రచారవర్తా
భద్రవిభూతి త్రిపుండ్ర భరణీ శరణ్యా ॥ 109

తోటకవృత్తం॥

సమదారివిభంజన శౌర్యధరా
కమలోద్భవవంశ ప్రకాశకరా
ప్రమథాదిప సేవన భవ్యతరా
రమణీయ సమంచిత రాజవరా॥ 110

ఇతి శ్రీమద్భ్రమరాంబికావరప్రసాదలబ్ధ కవితాధురంధర పూర్వకవిప్రయోగ శబ్దానుబంధబంధురసరస కవిమిత్ర యల్లనామాత్యపుత్ర సకల సద్గుణవిధేయ ఘట్టుప్రభునామధేయ ప్రణీతంబైన యాజ్ఞవల్క్య చరిత్రంబును మహాకథయందు ద్వితీయాశ్వాసము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

॥ శ్రీః ॥

శ్రీః

శ్రీ గణేశాయనమః

# యాజ్ఞవల్క్య చరిత్రము

## తృతీయాశ్వాసము

—: పరమ మునులందరు పద్మసంభవునివద్దకు వచ్చుట :—

క॥ ............................

............................

............................

............................ 1

వ॥ అవధరింపుము శౌనకాదిమునీంద్రులకు సూతుండు పరమ హర్షసమేతుండై బల్కిన వారలువిని యో మహాత్మా! యటమీద వృత్తాంతంబు వినదలతుము మా కెఱింగింపు మనిన నత డిట్లనియె. 2

గీ॥ అంతన యాజ్ఞవల్క్యుచే నపజయమున
పరమమునులందరును పరాభవమునంది
ధరణిమీదను నిల్వంగ తాల్మిలేక
దివికి నేగిరి పద్మసంభవునికడకు ॥ 3

వ॥ యిట్లు చని యింద్రాది దేవతలును, ప్రహ్లాదాది పరమ భాగవతులును రంభాది అప్సరసలును చిత్రరథాది గంధర్వులును మందరాది కల్పవృక్షములును హిమవదాది శైలంబులును గంగాది నదులును క్షీరపారావారాది సముద్రంబులును మీమాంసాది శాస్త్రంబులును

ఋగ్యజుస్సామాది వేదంబులును శేషాది పంచనగంబు
లును కామధేన్వాధులును చింతామణియును వైవస్వాధి
మనువులును ప్రభవాది సంవత్సరములును వసంతాది
ఋతువులును చైత్రాది మాసంబులును ఆదిత్యాధి
గ్రహంబులును అయిరావతాది గజంబులును అశ్విన్యాది
నక్షత్రంబులును వాలఖిల్యాది యోగీశ్వరులును పరివే
ష్టించియున్న కాంచన గర్భునిం పొడగని సాష్టాంగదండ
ప్రమాణంబు లర్పించి యిట్లనిరి. 4

—: యాజ్ఞవల్క్య ఋషివల్ల పరాభవంబు దెల్పుట :—

బ్రహ్మస్తుతి

సీ॥ బ్రహ్మసురజ్యేష్ఠ పరమేష్ఠిచతురాస్య
పద్మసంభవ పరబ్రహ్మరూప
కమలయోని హిరణ్యగర్భ లోకేశ్వర
అజపితామహశారదానిపాద
ధాతద్రుహిణ విష్ణుతనయ విరించి భూ
స్రష్ట ప్రజాపతి సగుణరూప
లోకపాలన రక్షలోకేశ చిద్రూప
భూసుర విశ్వస్వభూతనాథ
గీ॥ పరమ యోగీశ్వరాకాంత పట్టభద్ర
కామితార్థ ఫలప్రద కనకవర్ణ
వేదవేద పరబ్రహ్మ విశ్వరూప
అభవనీకు నమస్కార మఖిలజనక ! 5

ఆ. వె. యాజ్ఞవల్క్యయనెడు నా మౌనివర్యుండు
మము, [illegible]

యున్నవాఁడు వానియుదుతర శారదా
ప్రజ్ఞ లెల్ల భంగపఱుపవలయు ॥ 6

క॥ దీనికి తగిన ప్రయత్నము
యేనేర్పననైన దలచి యిప్పుడెనుము స
న్మానింపుము మిము వేఁడెద
మోసీర జగర్భ ! యనుపమోక్తులు మెఱయన్ ॥ 7

క॥ వేదాంత శాస్త్రసూక్తుల
వాదించితి మందరమును...
భేదింప నసాధ్యము నీ
భూదేవతలకు సమస్త భూతారాధ్యా ॥ 8

వ॥ అనిన మెల్లన నవ్వి శారదావల్లభుండు మహామహానుల
కిట్లనియె. 9

మ॥ పరమాత్ముండు సరోజ బాంధవునకున్ బ్రహ్మాణ్యుఁడైనట్టి శ్రీ
హరిపాదాబ్జసరోజ సేవకుఁడు గాయిత్రీ మహాదేవతా
వరలబ్ధుండు సమస్తదుష్కులుమవిధ్వంసుండు ప్రత్యక్షమీ
ధరనుం బాత్రుఁడు యాజ్ఞవల్క్యముని యేతన్మాత్రుఁడే
చూడఁగన్ ॥ 10

ఉ॥ మతినుపదేశమిచ్చెదన, మీా రమణుం దఱుదెంచి వేగ సం
స్థితుడయిమాతృగర్భమున తేజమునన్ సకలప్రయత్నముల్
సతతము వక్రగోళమున శారదశాపురమందు వొందుగా
నతని జయింప రామవిబుధాధులకైననసమస్తవిద్యాలన్ ॥ 11

వ॥ అయినను మీా యభిమతంబులు చేకూఱుటకు నుపా
యంబు చెప్పెదనని యాత్మనుం దలచిన. 12

—: గర్గిని సృష్టించుట :—

సీ॥ కొదమ తుమ్మెదగుంపు నదలించు నెఱి కొప్పు
చంద్రబింబమును మెచ్చని మొగంబు
కలువల విహసించు కన్నులును గెంపు
ప్రభలను నిందించు రథపటంబు
మాలూరఫలములా వరిపండ్లు పాలిండ్లు
సింగంబు కొదుదమల జనుమునడుము
కటక చక్రంబుల సమమైన పిఱుఁదులు
అరటికంభంబుల నదముతొడలు

గీ॥ కలిగి యత్యంత శృంగారగౌరవమున
భాసహాసవిలాస విభ్రమములలర
నామునులు సంతసింప నగ్నత్వమునను
గార్గి యనబుట్టె నొక్క కన్యాలలామ ॥ 13

క॥ తొలకరి మెఱుపు విధంబున
మొలగరి చిత్తరువు ప్రతిమ మేదిని నిలువన్
కొలువున గలవారందరు
తలలూచిరి దాని చక్కదనమును చెలువున్ ॥ 14

వ॥ యిట్లు సముద్రమథనావసంగంబునన్ బొడవైన వైష్ణ మాయా మోహినీ విధంబున జగదేకసుందరి యనం బొడ సూపిన యరవిందగర్భుని సభామందిరమునన్నున్న వారం దఱుం...... వేదనాదోధూయమానసులై తమ యనిమి షత్వంబు సార్థకంబుగా కనురెప్ప విడక చూచుచుండి రపుడు. 15

ఆ. వె. కమలసంభవుఁడు గార్గి మహాదేవి
జేరఁబిలిచి మనముచిగురులొత్త
మిగుల గారవించి మృధుమధురంబు లా
హితసుభాషణముల నిట్టులనియె ॥ 16

వ॥ లీలావతి నీవు భూలోకంబునకుం జని సర్వజ్ఞుండైన యాజ్ఞవల్క్యుండు నమ్మహామునిం దొడరి వేదవేదాంత శాస్త్రంబులచేత వాదించి యతని పరిభవంబు నొందించి రమ్ము పొమ్మనిన యది యిట్లనియె. 17

గీ॥ నలినగర్భ నేను నగ్నత్వముననున్న
దాన మానుషంబు తగవు విడచి
మానవతులు నిట్లు మగవారి కడకేగ
దగునె యతివలకును ధర్మచరిత ॥ 18

వ. యిట్లు గర్గి యనర్గళలజ్జాపారవశ్యంబున భూలోకంబునకుం బోవనొల్ల ననిన ధాతయు నీవు పరులనేత్రంబులకు వస్త్రాభరణంబుల మెలంగెదవు, నీ మనోహరుం డెవ్వఁడో వాఁడు, జూడ నగ్నత్వంబగుపడునని వరంబిచ్చిన, యది యత్యంత సుందరాంగివలెం బ్రకాశించు మాయామోహనత్వంబున సర్వజ్ఞుండగు, యాజ్ఞవల్క్యుని పరాభవంబు నొందింతునని బ్రహ్మచేత ననుజ్ఞాతయై యతనికడకుం జనునవుడు మానులు మాయాపరవశులై నెనువెంటం దిరుగ నమ్మదవతి మందయానమ్మున పుడమికరిగియచ్చట.

—: గర్గి యాజ్ఞవల్క్యుని పరిభవించుటకు చనుట :—

క॥ ఏరుల కషలాంకరముల
పారావారముల బహుళ పర్వతముల క్రం

గారవనంబులఁ జూచుచు
సారతర విలాసములను చనిచనియె నిట్లు ॥ 20

సీ॥ ఆలోలకల్లోల జాలసంభోధిని
దివ్యామృతాది దివ్యామృతంబు
రాజహంసావళి రాజిత సారసా
సురుచి సమాశాంత సుర పదంబు
గంధీర కుసుమపుష్పాల సేరబా గత
బంబరఝుంకార గుంభనంబు
తతసిక తామయాసిత నిర్జరీగీణ
తతమధురస్వ నామృతరసంబు
గీ॥ కలరవశుకాళి కలకంఠకలరవంబు
కూలసంస్థిత మునివేద ఘోషణంబు
గౌతమానామధేయ ప్రకాశితంబు
గంగ కనుపట్టె వధిక మోతుపదంబు ॥ 21

క॥ ఆగంగా స్థలములలో
బాగుగ స్నానంబుజేసి పరమమునులతో
నాగర్గి భగవతిని యును
రాగంబున తెచ్చెనపుడు రంజితమతియై ॥ 22

ఉ. కాంచెను యాజ్ఞవల్కులుని కాంచెనుగో
పురహర్మ్య సౌధమున్
కాంచన చంద్రనక్రముఖకల్పతరు
ప్రసుదాది మోదమున్
చంచలలోచనాగురు కుచద్వయ
కుంకుమసార సౌరబో

దంచితవాతపోహితతాతిల
సద్భ్రమరీ సమూహముల్ ॥ 23

సీ॥ సప్తగోదావరీ సలిలముల్ గొనివచ్చు
విమల పుణ్యాంగనల్ వేలసంఖ్య
యజ్ఞతంత్రముల త్రేతాగ్ని హోత్రంబుల
కుండము లిండ్లిండ్ల కోటసంఖ్య
వేదశాస్త్రపురాణ వివిధార్థము......లున్న
ధరణీ నిర్జరు లర్బుదముల సంఖ్య
పరమ విజ్ఞానానుబంధ మానసులైన
తాపసోత్తములు పద్మములు సంఖ్య

గీ॥ క్షత్రియులు వైశ్యజనులు నెంచంగమించు
శూద్రజనసంఘములు మహాక్షోభసంఖ్య
గలిగియుండుదు రైశ్వర్య కవితలగుచు
నామహామహా పట్టణాభ్యంతరమున ॥ 24

చ॥ పరగగ యాజ్ఞవల్కముని
భవ్యపదక్రమ వర్ణయుక్తమై
సురగురులీలలం మెరయ
శుక్లయజుస్సును వేదమారయం
చిరతరవాగ్విశేషమున
శిష్యులనెల్ల పఠింపఁజేయఁగా
సురతర సర్వదిక్కులను
ఘు.....ర్ణిలునాపర రాత్రివేళలన్ ॥ 25

వ. యిట్లఖిల జనమనోభిరామంబైన యన్నగరంబు జొచ్చి
యనర్ఘళ పతూవిలాసంబున గర్గి యను లోకసుందరీ,

మందగమనంబున నరుగుచు, నందు మందారకురువింద చందన పాటలిక్రమము కపిచుకుంమందమాకంద జంభిర, జాతితమాలాశోక, పున్నాగ, చంపక, శతపత్ర, మాధవీ, మల్లికాచూత, తరుబృందంబుల శీతల ఛాయామహిత లంబుల వినోదింపుచు గోదావరీ సలిలతరంగశీకరంబుల మార్గశాంతి వారింపుచు, సలలితస...ప...బుల కడ నల్లినవల్లికా ప్రసూనంబుల నల్లిబిల్లిగొని విలసిల్లిన పొడ లనల్ల......లసరు చల్లనిగాల్పుల కుల్లంబున నలరిం చుచు, వాడవాడల క్రీడింపు భూదేవతా నిచయంబుల నాదరింపుచు, పుణ్యమార్గంబుల గణ్యంబుగాభోదించు నానాశాస్త్రవాదమ్ములన్, బ్రస్తుతింజేయుచు నుత్తుంగ సౌధోపరిస్థలంబుల పరమశాంతులై తపంబు జేయు చుండు. సిద్ధవృద్ధతాపసులకు, ప్రణామంబులు సలుపుచు, ప్రతిగృహంబుల భూమీసుర స్తోమంబులుగావించు సద్యో ఘృతహోమ ధూపంబు లాఘ్రాణింపుచు, ప్రతిగృహంబుల నిడిన మౌక్తికరంగవల్లి వితానులల నంతరంగంబున మెచ్చుచువచ్చి యచ్చట. 26

సీ. ఫాలభాగంబుల భసితరేఖలుమీాద
మేదావితర్కంబు మెఱయుచుండ
కంఠభాగంబున ఘనతర రుద్రాక్ష
మాలికల్ గదువేడ్క తూలియాడ
కటమండలంబున కావి ధోవతియొప్ప
ధవళ యజ్ఞోపవీతంబు మెఱయ

విసుకెంపు దిగిమించి వెలయుకుండలముల
కాంతికర్ణంబుల గప్పుచుండ
గీ॥ మస్తకంబున పటుజటా మకుటమమర
కరమునందు కుశగ్రంధి గారవింప
మానికులమున మహానీయ మహిమగనిన
యాజ్ఞవల్క్యుని జూచె నా యంబుజాక్షి ॥ 27
వ. యిట్లు జూచి యభివాదనంబుజేసి యిట్లనియె. 28

—: గర్గి యాజ్ఞవల్క్యునితో సంభాషణ :—

గీ॥ తాపసోత్తమ బహువాగ్విధానతా వి
చక్షణుండని మునునిన్ను చర్చసేయ
విన్నదానవై వచ్చితి వేడ్కతోడ
శక్తిగలదేని వాదంబు జాలవలయు ॥ 29
సీ॥ పద్మసంభవమనః పంకేరుహంబున
విఖ్యాతిగా సంభవించినాను
వేదవేదాంతాది వివిధశాస్త్రంబులు
ప్రచురంబుగానేర్చి ప్రబలినాను
సౌందర్యలేఖా విచక్షణప్రౌఢిమా
కాంతలలోనుతి గాంచినాను
సమ్మోహసంగీత సాహిత్యవిద్యల
విశ్వంబులోపల వెలసినాను
గీ॥ మరియు సంజీవనీ ముఖ్యమంత్రగణము
లంచితంబుగ నే నభ్యసించినాను
నీవునాతో వాదింప నేర్చితేని
రమ్ము లేకున్న మారకే పొమ్ము పొమ్ము 30

వ. అట్లని మునకిద్దరికి మధ్యస్తులీమహామునులు వీరిని కటం
బున ప్రకటంబుగా ప్రసంగంబుఁ జేయుందగునని పలికిన
యక్కలికిని జూచి యాజ్ఞవల్క్యుండు ముసి ముసి నగవులు
నగుచు నిట్లనియె. 31

ఆ. వె. ఏమి జెప్పుకొనెదవిన్నియు నిట్లేల
విఫలమయ్యెనీదు విపలబుద్ధి
వనిననయన నీవు నగ్నత్వమూననున్న
దానవచట నిలువఁదగదు ॥ 32

గీ॥ పరసతివిశాల వేశ్యల ప్రాభవమున
పావడ ధరింపకుండుట పాటుగాదు
నళినలోచన యిటుల నగ్నత్వమునను
వచ్చితివి సిగ్గుచెడి మగవారికడకు ॥ 33

శా॥ భగ్నంబై బహుభోగవైభవముసౌభాగ్యంబునష్టంబగున్
మగ్నంబౌ నిజధర్మముల్ బహుళసన్మానంబు దూరంబగున్
లగ్నంబుల్ సకలాప్తకీర్తులును సల్లాపంబు లింకేటికిం
నగ్నత్వమ్ముననున్న దానిగనిన న్నానాఘముల్ చేకుఱున్ ॥

గీ॥ గానఁదెలియఁజూడ గారాదునిన్నుసం
భాషణంబులు సేయఁబాటిగాదు
నిన్నుగూర్చియిట్లు నిగమాంత శాస్త్రంబు
వాదుజాయ తగవుగాదు జనుము ॥ 35

క॥ మానముపోవక తిరిగెడి
మానినులకు కీర్తిగలదె మహిభర్తలుస
న్మానింతురెనుతిగందురె
యేనాడును నెన దొరకునే యిహపరముల్ ॥ 36

గీ॥ అనిన నత్యంత లజ్జాభయములు మేన
తామసింపగ గర్గిసితాచయన
పాణితలములకు కుచకుచ భరయుగంబు
మదన గేహంబు బూని యామందయాన 37

క॥ నొక్కించునొక మరువున
చక్కజముగ నిలిచి వెడలు నశ్రుకణంబుల్
గ్రక్కుచు నక్కన్యామణి
మ్రొక్కుచు నాయాజ్ఞవల్కిముని కిట్లనియెన్ ॥ 38

వ. స్వామీ, నేను మీతో వాగ్వాదంబునకు జనుదెంచిన యపరాధంబు సహింపుము, మీ మహాత్త్యం బెరుగక పనుదెంచితి, పద్మసంభవుని వరంబునబుట్టి, యన్యులకు దివ్యాభరణ భూషితమైయుండుదును, మన్మనోహరుం డెవడో వానికి నగ్నత్వంబు గనుపట్టును, యిట్టిగుట్టు నెట్టనం దెలిసితిరి గావున, నాకు మీరే మనోహరులు నన్ను పాణిగ్రహణంబు సేయవలయు, మీ భార్యనై యుండెదనని పలికి వెండియు నమ్మందయాన యిట్లనియె.

క॥ మీతోడను వాదింపను
నాతరమె మహానుభావ! నయ మార్గములన్
చేతోజాతసుఖంబుల
ప్రీతింబొందింతు మీయభీష్టము నలరన్ ॥ 40

క॥ ఈవిధమున పద్మజుండు
దేవుడు మున్నానతిచ్చి ధృతినిటకని చెం
గావున నన్నురమింపుము
శ్రీవనితా మణిని శౌరి చేకొనుభంగిన్ ॥ 41

వ॥ అనిన దరహాసిత వదనుండై యాజ్ఞవల్క్య యా దండ యాన కిట్లనియె. 42

క॥ భామా మాతో వాదము
కామించుచు నేగుదెంచి కామ కదనముం
గామించి మాటలాడెద
వేమీ తాపసుల కేల నీమార్గంబుల్

క॥ పంచేంద్రియములు బాసి ప్ర
పంచం బంతయునురోసి బ్రహ్మజ్ఞానో
దంచితులగు మునులనుకా
మించిన సౌఖ్యంబుగలదె మెలతలకిలలోఁ ॥ 44

క॥ కామిను లిఱువలె వలచిన
కామించకయేనువున్న కలహము హెచ్చుఁ
స్వామి ద్రోహులు పణతులు
సామాన్యమెవారితోడ సఖ్యముసేయఁ ॥ 45

క॥ మ్రాఁకుల క్రిందను వ్రాలిన
యాకులు భక్షించి యెల్ల యడవులలోనఁ
ఆఁకలి దప్పుల దంతము
నేకాకులు మునిసఖంబు లేమి సుఖంబుల్ ॥ 46

సీ॥ కర్ణకుండల హారికటక కేయూరాది
భూషణంబులుబెట్టి పొదలగలుగు
భూ......నారమె పొలుపొందు చున్నట్టి
మంచికోకలుగట్టి మసలగలుగు
సద్యాఘృతోపేత సకలశాకాపూప
మృదులాన్నకబలముల్ మెసగగలుగు

నవరత్నకీలిత నవ్యసౌధోపరి
చందనాగరుకాశ్మీర చంద్రముఖ్య
సీ॥ ......................
భూరిపరిమళములనెల్ల బూయఁగలుగు
కాంతమానులు మీఁదనాకాంతువిడిచి
చెడక ధరణీశు మగనిగా జేసికొనుము ॥ 47

మ॥ పరమాన్నాదినువస్తు భోజనములా బాగైనకస్తూరికా
గరుకాశ్మీరసుగంధ లేపనములా గాంగేయరత్నాంబరా
భరణశ్రేష్ఠములా హిరణ్మయత మహాపర్యంతిదేశంబులా
సరసీజానన సంయమీశ్వరులతో సఖ్యంబునీకేటికిన్ ॥ 48

క॥ పోలింప సొమ్ముచీరెలు
లాలితముగ నన్నమునుల లలిగల్గవలెన్
స్త్రీలకు వలువని మానులు
జాలంబడిలేమి చేతసమయంబగునే ॥ 49

క॥ ఏ చందనంబున నింపదు
గోఁచియు కృష్ణాజినంబు గొనబడు జెడలున్
సాచుక బూడిదె బూసుక
బూచియువలెనున్న వారిపొందువరింతే ॥ 50

క॥ అనువైన వానిఁగాచ
క్కనివానిగ మిగుల ధనముగలిగినవానిం
మనసిజ భోగసుఖంబులఁ
దనియించెడ వానినొకని తగులుముతరుణీ ॥ 51

వ. అనిన మఱియు కటకటంబడి యుచ్చెలువ, వెచ్చనొచ్చుచు పచ్చవిల్తునిపెను చిచ్చుమేనన్, బహుళంబుగా బ్రకాశింప దనము ముచ్చట తేటపడ నిట్లనియె. 52

క॥ ఎన్నియు నీవిటుపలికెద
వెన్నికగా నీవెమగఁడ వెట్లైనను నా
యన్యులు తక్కిన పురుషులు
కన్నులనన్యులను జూడకలలోనైనన్ ॥ 53

గీ॥ పంకజాక్షి వలచిపతి చెట్టఁబట్టిన
ద్రోయఁదగదటంద్రు తొల్లిబుధులు
నీవెఱుంగనట్టి నిగమధర్మంబులు
ధరణియందుగలదె తాపసేంద్ర ॥ 54

క॥ ఋతుకాలముఁ దప్పింపక
సతితోడను రతిని కేళి సల్పుచునిలలో
నతిమోదంబును బెంచిన
యతనికి కైవల్యపదమటంద్రు మునీంద్రుల్ ॥ 55

క॥ ఋతుకాలముఁ దప్పించిన
యతనిని శమనుండుబట్టి యతి ఘోరముగా
మితిలేని నరకములలో
వితతంబుగద్రోయు నంద్రువిబుధులు జగతిన్ ॥ 56

ఆ. వె. గానసన్మునీంద్ర! ఘనతానముందీర్ప
నదిశుభంబు తేజమనగనీకు
నిన్నుగోరినట్టి నేనన్య జనులచే
పట్ట వల్లనంత పనికినేన ॥ 57

ఉ॥ భూసురవర్య! సర్వజనపూజ్యులుమీరలుమిమ్ముఁబొందినఁ
వాసియువన్నెయుంగలుగు వారిజ నేత్రల కెన్నఁగాదగుఁ
యేసుఖముఁ ఘటించినను నెంచగరాని యసత్యవాక్య
ముల్
మీసలమీఁది తేనియలు మేదినిరాజులతోడసఖ్యముల్॥ 58

గీ॥ మోసములు జేసి గొబ్బున మొఱగి చనుదు
రాయువల్పులు నరపాలురరసిచూడ
వారికిని భార్యలై విభవప్రచార
ములును జెందును నీచకాంతలునునధిప॥ 59

వ. అది యట్లుండె మీరు మదీయహృదయం బరయదలంచి
యెన్నివిధంబులం బలికిన నా చిత్తంబు మత్తిగిలియ
న్యులం బరిగ్రహింపనోపుదు పూర్వంబున కమలగర్భుండు
నన్ను బుట్టించి భూలోకంబునకుం బనుచు నపుడు పృథ్వీ
వ్యాపస్తేజో వాయ్వాకాశంముల సాక్షిగా నానతిచ్చిన
తెఱంగెఱింగించె దగర్గి నీమానం బన్యులకు జూడఘనదు
ఘటంబు గూడంబై యుండు నీ గూఢాంగంబు నీ పెనిమిటికె
తెలియనని బలికె నతనివచనం బమోఘుంబుగా నిష్ప్రా
వాదంబులుగాదు నీ మానసంబున సందేహంబు మాని
నన్ను పాణిగ్రహణంబు సేయుమని పలికిన. 60

ఆ. వె. గర్గియ నెడు నరస ఘనతర వాక్సుధా
రసములాత్మకర్ణరంధ్రములకు
విందునాచరింప విని యాజ్ఞవల్క్యమ
హామునీంద్రుఁడప్పు డాత్మ నలరి॥ 61

వ॥ దానికి నూత్నమణి స్వర్ణకలితంబులైన యఖిలభూతంబు
లను, దివ్యాంబరంబులం జేర్మినలంకరించి సులగ్నంబున
మహావైభవంబొప్ప పాణిగ్రహణంబుజేసి సురతాది
భోగంబులం దృప్తులం బొందించుచు, దన యగ్రమహిషి
వలన పదియొనమండ్రును, యా గార్గివలన నిరువది నలు
వుర కొడుకులుంగని యానలు బదిద్దరి కుమారులకు
క్రమంబున జాతకర్మాదిక్రియలను గావించి పుత్ర పౌత్ర
పరంపరాభ్యుదయంబు దామరతంపరగాగృహస్త ధర్మం
బులం బ్రవర్తింపుచున్న సమయంబున. 62

క॥ ఉద్దాలకు డను సంయమి
వద్దికి చనుదెంచి యాజ్ఞవల్క్యులు నెదుటం
గద్దించి ప్రసంగమునకుఁ
దద్దయు రమ్మనుచు బలికె తగు ధైర్యమునన్ ॥ 63

వ॥ యిట్లు నిలిచి మఱియును. 64

సీ॥ చర్చించు ఋగ్వేజు స్సామంబునొక వేళ
నొకవేళ వేదాంత ముచ్చరించు
వ్యాకరణాదుల వాదించు నొకవేళ
నుపనిషత్తులు బల్కు నొక్కవేళ
సకల పురాణముల్ చర్చించు నొకవేళ
దనరంగ తురగ శాస్త్రంబు నొకట
నొకవేళ మంత్రము నొగి పఠింపుచునుండు
నొకవేళ గానంబు నొరయఁజేయు

గీ॥ నొక్కవేళను బలుకళయుక్కు మిగిలి
[illegible]

కాలుద్రవ్యచునుండును కయ్యాముునకు
యాజ్ఞవల్క్యలుతో నవుడాఘనుండు ॥ 65

వ. యిట్లు వర్గళంబున తనతో వివాదంబునకుం దగిలిన భూదేవాగ్రణిం గనుంగొని అసాధారణ ప్రజ్ఞా ప్రవీణుం డైన యాజ్ఞవల్కలుం డిట్లనియె. 66

క॥ ఏవిధమున వాదించితి
వీవాచాగుంభనమున నీ చతురతమ
ద్భావమున నెఱుగఁ జెప్పుము
జేవలు విమలంబుగాను చిగురంబుట్టెఁ ॥ 67

—: ఉద్దాలకుండు సంభాషణ :—

వ. అనిన నుద్దాలకుం డిట్లనియె. శ్రీమన్నారాయణుండు బ్రహ్మోపదేశంబు చేసిననియును, వేదవ్యాసుని వలనన......త భోధాచరణ ప్రచారంబులుగల నిగమ్మాది విద్యలన్నియును నేర్చితి ననియును వైశంపాయనునకు బ్రహ్మహత్య సంభవించిన పరిహారంబు జేసితి ననియు మంత్రాతుతస్వర్గన మంత్రంబున జనకుని సభా భవనము లుల్లసిల్లు చిగురు మెత్తించి తిననియు, గాయత్రీమంత్ర దేవత ప్రసన్నంబయ్యె ననియును, సూర్యునివలన శుక్లయజుస్సు నభ్యసించితిననియును చిత్రరథుండును, గంధర్వుడు శిష్యుడై, ప్రవర్తించెనని యును, బ్రహ్మమానసపుత్రియైన గర్గియనుదాని వరించితి ననియును మృతసంజీవనీమంత్రంబులు వడసితి నని యును, మిగుల గర్వంబునం బ్రవర్తించెదవు విశ్రివిగెదవు

నీ నిర్వాహకత్వంబు తెలియవలయునని జేసిన ప్రశ్నలు
ప్రత్యుత్తరం బియ్యని వెండియు నిట్లనియె. 68

ఆ.వె. సురలరీతి జరయు మరణంబులును లేక
యున్న మానవులకు నుర్విలోన
చావు లేవిధమున సంభవించెనువారి
కళనమెట్లు గలిగె నదియునెట్లు ॥ 69

వ॥ మఱియు తెలియవివరింపుమనినయాజ్ఞవల్క్య మునీంద్రుం
డిట్లనియెను. ఉద్దాలక! యీపద్ధతి రహస్యం బన్యులెఱుంగ
నశక్యంబు నేను సకల పురాణంబులు శోధించి చెప్పెద
నని యిట్లనియె. 70

క॥ గౌరిని కల్యాణంబై
మారవిభంజనుఁడు హృష్టమానసుఁ డగుచున్
తీరని క్రీడలు సలుపుచు
చేరికగాకున్న వేళ చిత్తములలరన్ ॥ 71

ఆ. వె. తారకాసురుడనతగు పెద్ద దైత్యుండు
బాధలొనరఁజేయు పటురయమున
సకల దివిజులపుడు సర్వజ్ఞగిరికిని
జనిరి సంభ్రమమున చతురులగుచు 72

క॥ వాకిటకడ ప్రమథులపడ
నూకి ప్రవేశించి యిటులనుతి జేసిరియో
శ్రీకంఠ! పార్వతీశ్వర!
యాకర్ణింపంగదవె యస్మదాలాపంబుల్ ॥ 73

క॥ దారుణ తారకుఁడనియెడి
ఘోరనిశాచరుఁడు మిగుల కోపించి యహం

కారమున నన్ను వాడిమి
పోరాటముమాన్పి మమ్ము బ్రోవుము హేశా ॥ 74

గీ॥ కావుకావుమయ్య ! ఖగవాహనప్రియ !
నిర్వహింపుమయ్య ! నీలకంఠ !
అభయమియ్యుమయ్య అద్రిజానాయకా
మమ్ము బ్రోవుమయ్య మదనవైరి ॥ 75

క॥ రక్షింపుము, రక్షింపుము
రక్షింపుము నీలకంఠ రాజకిరీటా
అ......తాళు...శుద్ధ......
భక్షితభావజ శరీర పరమోద్ధారా ॥ 76

వ. అని మొఱలుబెట్టినవారి కభయంబు లియ్యందలచి.....
శిరసార్ద్రుఁడు చిత్తుండై యామిధ......శర్మంబు వాలిం
చిన కాత్యాయని యత్యంత క్రోధాక్రాంతయై మన్మనో
హరుండు నాకు గర్భాదానంబు సేయక, మిన్న
తత్కార్యంబు విఫలంబుజేసితిరి కావున మీర లపుత్ర
కులై పోదురని శపియించిన నాటనుండి నిర్జరులకు పుత్ర
జననంబుల భావంబులయనది గారణంబున యూర్ధ్వలో
కంబునకు భారంబులేకయుండె, న దేవతల చందంబున,
నమృతాహారంబులుగాని జరామరణంబులులేక పుత్ర
పౌత్రాభివృద్ధింబొందినకతంబున, ఆచక్రవాళాచల భూ
చక్రంబున మానవులు యెక్కడ చూచిన లెక్కకు
మిక్కిలియై క్రిక్కిరిసియుండిన తద్భారంబు భరింపనోపక
భూదేవి పంకజగర్భపాలకుంజని యిట్లనియె. 77

ఆ. వె. పద్మగర్భ ! మెండు ప్రజల భారమెల్ల
తాల్వనోపలేక తల్లడిల్ల
వచ్చియున్న దానవారల మొల్లంబు
లటియ కవులఁజేయు మయ్యయనిన ॥ 78

వ. తద్వాక్యంబులు విని పరమేష్ఠియపుడు. 79

గీ॥ ఆవసుంధర వెనువెంట నరుగుదేర
జలజగర్భుండు కైలాస శైలమునకు
బోయియత్యంత విభవ విభూతి మెఱయ
పెద్దకొలువున్న పార్వతీప్రియునిగాంచి ॥ 80

గీ॥ ధరణివచ్చిన కార్యమాదరణతోడ
విన్నవించిన నాతఁడు విని దయార
సార్ద్రమానసుఁడగుచును సరసిజాత
సంభవునిగాంచి పల్కెను సంతసమున ॥ 81

వ. పరమేష్ఠి ! నీయభీష్టకార్యంబున నొక్క క్రమంబు జెప్పెద మానవులకు నమృతవారంబులు దెప్పించి యశనంబు మెసవంజేసిన మందూచాత పైత్యశ్లేష్మంబులును, క్షయాభస్మార గుల్మకట్టువులను మలమూత్ర నిరోధంబులును, జ్వరాతిసార గ్రహణపీనస, సిరస్త్రాకంపనతాంత్రిక ప్రలాప బధిరత్వ బహుమూత్ర నేత్రపటల జిహ్వాదోష శోభాతి సన్నిపాతంబులాదియగు మున్నూటరువది రోగంబులం బొడమ తత్కారణంబున, మరణంబు లతిశయంబుగా బొందుదురు, వసుంధరాదేవికి భారంబుబాయు విధంబుగా జేయుమని పితామహుండు మఱియు నిట్లనియె. 82

క॥ ఈయన్న లేవిధమ్మున
జేయందగు మనుజులకు సుశిక్షితహారం
బేయు_క్తము నెఱిగింపుము
జేయుదుమీయాజ్ఞ మోసి శిరమున నభవా॥ 83

వ. అనిన మహాత్మా! యేను శంకరుండను నామంబున బ్రహ్మాండంబులెల్ల విరియ యవాదిధాన్యంబులయ్యెద, కాత్యాయని దేవి శాలితిలగోధూమ, చణకముద్గాది ధాన్యంబులై ప్రభవించు తండులంబువర్ జలసహితం బులై, యగ్నిముఖంబున పచనంబగు నాయన్నంబు మధురతి_క్తకషాయామ్లకటు లవణంబులను షట్రసద్రవ్యం బులుగా ప్రధానంబులుగా మానవులు భక్షింతురనిన వెండియు హిరణ్యగర్భుండిట్లనియె.

క॥ నరులందరు భక్షింపను
ధరలోపల నెవ్విధమున ధాన్యములమరం
బురహార! ప్రతి వర్షమునకుఁ
బరిపూర్ణముగా జనించుఁ బద్ధతి చెప్పుమా॥ 85

వ. అనిన పరమేశ్వరుండిట్లనియె, మదీయ్యవాహనంబై వృష భంబునందు అనడ్వాహంబులంగల్పించి నరుల కృషి జేసెద, సీరావేశాంకురంబులు హలంబులుగా నియోగించెద, నప్రయత్నంబునకు సహాయంబుగా విశ్వకర్మంబనిచెద, తద్విధంబున, వసుంధరాఖననంబు జేసి మేఘంబును గుణం బుగా వి_త్తనంబుజల్లిన సస్యంబులకు పర్జన్య ప్రసాదంబున సమున్నత ద్రవ్యంబులై ఫలియించు ధాన్యంబులు నభి వృద్ధియగు జనంబుల కాహారంబునకు జాలియుండునని

పలికిన యా మహేశ్వరువచనంబులకు పితామహుండు సమ్మతించి యతని వినుపించి తనలోకంబునకుం జనియె నపుడు. 86

క॥ ధరణికి తద్విధ మెంతయు
నెఱుగంగా జెప్పి భారమెల్లను నీకుం
బరిహరణ మయ్యె యిఁకమీఁ
దరయుగతా మునులఁ బొందకనుచును బనిచెన్. 87

వ. యివ్విధంబున భూదేవియందు బొడమిన ధ్యానంబులు లోకులు లూఖలముసిల ఘరట సంఘటనశాప ప్రముఖోపకరణంబులు సహాయంబులుగా సమకూర్చి జలాగ్ని సంయోగంబునం బక్వంబుజేసిన యన్నంబు భక్షించిన తద్రసంబున స్త్రీపురుష సంయోగంబునం జనియించి వృద్ధి వహించి కాలవశంబునంబొందుదురు. యిది గారణంబున మానవులకు మరణంబుగలిగె మనుజులు హతంబుజేసెడి కతంబున అన్నంబు సంభవించె అని యాజ్ఞవల్క్య మునీంద్రుండు జెప్పిన యుద్దాలకుండు వెండియు ప్రత్యుత్తరం బియ్య నోపక పరాభవంబుం జెందెనపుడు. 88

వ. తదనంతరంబ, 89

—: శాకల్యుండు యాజ్ఞవల్క్యుని డీకొనుట :—

క॥ శాక్యలుండును సంయమి
యాకమలజు ననుమతమున నరుదెంచియు సు
శ్లోకుండును యాజ్ఞవల్క్యుని
దీకొని యిట్లనియె వేగ దృఢవాక్ప్రౌఢిన్ ॥ 90

గీ॥ దైవ యత్నంబు మనుజ యత్నంబురెండు
సమములో యివిపరిభేద సంశయములో
అరసి వివరింపుమనిన యాయాజ్ఞవల్క్య
ఘనుఁడు యిట్లనిపలికె శాకల్యునకును ॥ 91

—: యాజ్ఞవల్క్య దైవయత్నంబు ప్రధానమని తెలుపుట :—

వ. మహాత్మా! వినుము యీయుపాఖ్యానంబు తొల్లి గర్గున కునారదుండు విశదంబుగా జెప్పెను. అదియును మీాకెతిం గించెద. దైవంబుత్తమంబు మానుషమధమంబు దైవాధీనం జగత్సర్వంబనియును సర్వం విష్ణుమయం జగత్తనియును యేకోవిష్ణు మహాద్భూతం బనియును, న దైవం కేశవాత్పరంబనియును స్మృతులవలన వక్కాణింపబడియె, సకల ప్రయత్నంబు లీశ్వరాధీనంబులు, గావున మర్త్యులకు స్వతంత్రం బెక్కడిది, పాషాణంబుల యందు లోహంబు బుట్టు తెఱంగున, దారువులయందు బుట్టిన వైశ్వానరుని చందంబున దధియందు నవనీతంబుపోలి సర్వజీవులయందునుగూడ ప్రచారంబున పరమేశ్వరుండు అణోరణీయాృంమహతో మహీయాృనను, వేదసూక్తంబులు......మృషావాదంబులేనిది యట్టుండనిమ్ము, భగవంతుండు గల్పించిన దరిద్రంబును మహదైశ్వర్యంబును దుఃఖమును జరయు మరణంబును, మనుష్యులకు ప్రతిబంధకంబులుగాన మెచ్చులింప పిప్లమాయావశంబున బ......పొరలు నరులకు కర్తవ్యం బెక్కడిది, యని పలికిన వెండియు నిట్లనియె. 92

క॥ తానెస్వతంత్రుఁడ నైనను
మానవుఁడిల్లెల్ల జచ్చుమసలక దైవా
ధీనముమర్త్యుని ప్రాణము
పూనను శక్యంబె కాలపూర్ణంబైనఁ॥ 93

గీ॥ పూర్వజన్మ కర్మపుణ్యంబు లెఱుఁగను
తోడవచ్చుకీడు తొలఁగఁగనునొ
మనుజ జన్మమేల మహిలోన బహుదుఃఖ
భాజనంబు దుఃఖపర్వతంబు॥ 94

సీ॥ ఐశ్వర్యములపెక్కు లనుభవింపఁగ గోరు
బ్రహ్మకల్పంబును బ్రతుకఁ గోరు
సర్వ సర్వంసహా చక్రమేలను గోరు
చంచలాక్షులు సంచరించ గోరు
గుఱుతుమీాద ధనంబుగూడ బెట్టగఁ గోరు
కడుపుత్రపౌత్రులఁ గనగఁ గోరు
కడలేని గృహములు గట్టింపగాఁ గోరు
గురుతరాన్నంబులు గుడువఁగోరు
ఆ.వె.కట్టఁగోరుమేలు ఘటియింపఁగాఁగోరు
నమర కల్పములను నలతిగోరు
తానుతలచినట్టు దైవంబు తలఁచునే
మనుజయత్నమేల మంతు కెక్కు॥ 95

క॥ తానతి విద్యావంతుఁడ
తాను సమర్థుండ పెక్కు ధనధాన్యంబుల్

తానె ఘటియించిరనియను
మానవుఁ డఖిలంబునకును మాధవుఁడుండన్ ॥ 96

క॥ తనకరమునఁ దనపదమునఁ
దనమోమునఁ జేర్చినట్టి ధన్యుండైనన్
గొనకొని పశువులు మేపెను
జనునేదైవాజ్ఞమీఱి జనులకు నెచటన్ ॥ 97

వ॥ కావున దైవమానుషయత్నంబులలోను, దైవయత్నంబు ప్రధానంబని యాజ్ఞవల్క్య మహామునీంద్రునివలన మనుష్యయత్నంబ ప్రధానంబని తెలిసెయు, దర్పంబున ప్రామాణ్య విపరీత వివాదంబునకుం దొడంగి శాకల్యుం డిట్లనియె. 98

—: శాకల్యుండు వాదించుట :—

క॥ దబ్బర లాడెద విదిరొక
యబ్బుర మమ్మానుషంబొ యనిశముధరలో
గొబ్బున మనుజుఁడు సేయక
యబ్బునె దైవంబు జూడ నందరికనఘా ॥ 99

క॥ మనుజుం డొనర్పు సర్వము
మనుజుఁడయగు కీర్తిశోక మానుగధరలో
ఘనముక్తి ముక్తులెప్పుడు
మనుజుఁడు దాచుకొనగల్గు మహిలో నెచటన్ ॥ 100

దర్పకగురుండు గొన్నవతారములను
గొలసి మానవుఁడై పుట్ట వేడ్కబడు నె 101

ఆ. వె. త్రిదశలోకమునకు దేవుండు విష్ణుండు
యిహమునకును జీవుఁ డీశ్వరుండు
గాన యధముఁడగుచుఁ గల్లునేయుంతట
నెంతవారికైన నెంచదరము ॥ 102

వ. అదియునుగాక కాశి, గయా, ప్రయాగ, అవంతీ, మధుర, శ్రీశైలాహోబిల, వెంకటాచల, శ్రీరంగ, శ్రీకాళహస్తి, చిదంబర ముఖ్యదేశంబుల శివ విష్ణు విగ్రహంబులును, జని కర్మితంబులుగావె కావున, భూలోకంబున మర్త్యుఁడె కర్తగాని దైవంబుగాదనియు ప్రమాణ వచనంబులు కర్ణకఠోరంబులుగా బలికిన యాజ్ఞవల్క్య మహాముని కోపించి మారణ మంత్రంబు లుచ్చరించి కుశకాండంబు వైచిన. 103

—: శాకల్యుండు భస్మమగుట :—

క॥ అదియొక బ్రహ్మాస్త్రంబై
పదపడి శాకల్యు శిరము భగ్నముసేయం
జెదరిరి తాపసులెల్లను
చదలును ఘూర్ణిల్లె రుతుశశిరవియుతమై. 104

క। జడధిజలంబింకెను బలె
తడబడి గగనంబునుండి తారలు రాలెఁ
సైను భూతసమూహము

—: ఋషులు యాజ్ఞవల్క్యుని శాకల్యుని బ్రతికించమని వేడుట :—

వ. అప్పుడు కశ్యప, భరద్వాజ, విశ్వామిత్ర, కౌండిన్య, శ్రీవత్స, గౌతమ, గార్గేయాది మహామునులు యాజ్ఞవల్క్యుంగాంచి యిట్లనిరి. 106

క॥ ఏమయ్యా! మీరుఁ దగునే
యీముని బ్రహ్మంబుహత్య యిటుల ఘటించెన్
సామర్థ్యంబున కమ్మఱి
నీ మనుజుని బ్రదుకఁ జూడు మిప్పుడు కరుణన్ ॥ 107

గీ॥ అమ్మహాత్ముని మీరు దయారసమున
అప్రమాణంబులైన వాక్యములు పలికె
నట్టి ఫలమేల దోడ్తోడ ననుభవించె
కావు మికనైన యితనిని కరుణతోడ ॥ 108

—: శాకల్యుని బ్రతికించుట :—

వ. అని యమ్మహామునులు ప్రార్థించిన కరుణారసార్ద్రచిత్తుండై యాజ్ఞవల్క్యుయు సంజీవని మంత్రంబులు చర్చించి, జలంబులు ప్రోక్షించిన శాకల్యుండు సజీవుతుండై వేచి శుక్ల యజుర్వేద పారాయణునకు నమస్కరించి యిట్లనియె. 109

ఉ॥ చూచితిగాని యిట్టి ఘనచోద్యము లెచ్చటనైన గంటిమే
నీ చతురానులాపములు నిక్కము వేదసుశాస్త్రతుల్యముల్
ఆ చతురాస్య డింతటి సమర్థుఁడుగాఁడు సమస్త విద్యలన్
గాచినహింపుమయ్య గుణగణ్యమదీయకళాపరాధముల్,

క॥ లోకములనుండు వారలు
భూకాంతుల సభలమిమ్ము పొగడంగలరే
యేకాలది విబుధులయినను
మీకెదురుగ మాటలాడ మే మర్హులమే॥ 111

వ. అని వినుతించిన యాజ్ఞవల్క్య మునీంద్రుండు శాకల్యు నభినందించె నంత గౌతమ, కశ్యప, భరద్వాజ, వసిష్ఠ, వాల్మీక, కణ్వ, కపిలాదిసంయములు శుక్ల యజుర్వేద పారాయణుని యేవిధంబునం గెలువనేరక యతనితో సముభాగంబున వర్తించిరట్లు, సకల వాదం బులం గెలిచి మేఘంబులలోన వెడలు ప్రభాకరుని చందం బున నయ్యాజ్ఞవల్క్య లోకంబులలో ప్రథమపూజ్యుండై ప్రవర్తించెనని విని ప్రథమ శాఖాద్వయ ప్రభుశిఖామణు లందరు మంజుభాషణుని గంధవస్త్రాభరణంబులు బూజించి రప్పుడు 112

గీ॥ మున్ను సూతుండు శౌనకముఖ్యులకును
గరిమ వినుపించె యాజ్ఞవల్క్యుల మునీంద్రు
భవ్యచరితంబు యీమంజు భాషణుండు
పొసగసభికుల కెఱిఁగించి పూజ్యుఁడయ్యె॥ 113

శా॥ సతతాన్నోదక వస్త్రధాన్యకనకక్ష్మాకన్యకాదాన వి
శ్రుతసుస్వాంత! ఘనాత ధైర్యకనకక్షోణీంద్ర! సంధ్యాదిక
వ్రతనిష్ఠాది గరిష్ఠ! సజ్జన ఘటారాజీవఖద్యోతనా
నత నానావిధమంత్రివర్య చతురామ్నాయ క్రియా సం
గ్రహా॥ 114

క॥ భూలోకశక్ర జలనిధి
వేలాపర్యంతభువన విశ్రుతకీర్తి
ఫాలాక్ష భక్తసదవన
శీలాకరుణాలవాల శివగుణజాలా ॥ 115

భుజంగప్రయాతము ॥

సమస్తావనీనాథ సంస్తూయమానా
హిమక్షీర భాకీర్తి హేలానిదానా
విమాలిన్య విజ్ఞాన విద్యానిధానా
ప్రమాదీవిహీన ప్రభావ ప్రధానా ॥ 116

ఇతి శ్రీమద్భ్రమరాంబికావరప్రసాదలబ్ధ కవితాదురంధర పూర్వకవిప్రయోగ శబ్దానుబంధబంధురసరస కవిమిత్ర యల్లనామాత్యపుత్ర సకల సద్గుణవిధేయ ఘట్టుప్రభునామధేయ ప్రణీతంబైన యాజ్ఞవల్క్య చరిత్రంబును మహాకథయందు తృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరామచంద్రార్పణమస్తు.

॥ శ్రీః ॥